వేంకట్రామ గ్రంథమాల—34.

# శ్రీ తులసీరామాయణము

## కిష్కింధాకాండము.

(నిర్వచనము)



గ్రంథకర్త:

భాగవతుల నృసింహశర్మ.

# శ్రీ తులసీరామాయణము

## కిష్కింధాకాండము.



(ద్విపదకము)

విజయవిజయ, విచిత్రవీరబొబ్బిలి, ప్రతిజ్ఞాచాణక్య, అభినవభక్తప్రహ్లాద,
శృంగారసంధ్యాది గ్రంథకర్తలగు

**భాగవతుల నృసింహశర్మగారిచే**

విరచితము.

printed by:-COCANADA PRINTING WORKS,
COCANADA.

published by:-Bh. N. SERMA,
Proprietor, Vegu-Jukka Series,
Pudipeddivari Street,
BERHAMPORE.
*(Ganjam)*

1st Edition
1000 COPIES.
1929



(వెలువ, రూ 1.0.0)  (ఖర్చులు ప్రత్యేకం)

☞ *For Copies apply to the Publisher.*

మంచిలాభము! # బహుమానము! త్వరపడుడు!

వేగుంజుక్క-గ్రంథమాల చందాదారులు ముందుగ రు 6-2-0 మనియార్డరుద్వారా పంపిన సంవత్సరమునకు ప్రచురింపబడు 6 గ్రంథములు పోష్టుఖర్చులు మేమేభరించి పంపుటయేగాక బహుమానముగ దిగువ నుదహరించిన గ్రంథములలో నేయొక్క-గ్రంథము కోరినను ఉచితముగ పోష్టుఖర్చులు భరించి పంపుదుము. ఇందువలన చందాదారులకు పోష్టు మనియార్డరు ఖర్చులక్రింద వృధావ్యయమగు రు 2-10-0 అను బహుమానగ్రంథమొక్క-విలువ రు 1-0-0 వెరసి రూ 3-10-0 లాభముపొందగలరు. చందాదారులు కాగోరువా రిట్టి ప్రవేశరుసుము మీయనవసరములేక యీ సంవత్సరము చందా రు 6-2-0 ముందుగ మాకు బంపిన వారిని చందాదారులుగ జేర్చుకొని, పోష్టుఖర్చులు మేమేభరించి పుస్తకములను బంపుచుందుము. సంవత్సరముచందా ఒక్క-సారి పంపలేనివారు అర్ధసంవత్సరము చందా రూ 3-0-0 పంపవచ్చును. మాపుగ్రంథములు వారికి పోష్టుఖర్చులు మేమే భరించిపంపుదుము. అర్ధసంవత్సరముచందా పంపి-వారికి బహుమానగ్రంథమీయబడదు. కనుక వెంటనే సంవత్సరము లేక అర్ధసంవత్సరము చందాలను మా కార్యాలయమునకు బంపుడు. సం॥ చందా 6-2-0 తో క్రొత్తగా చందాదారులుగ చేరువారికిగూడ వారుకోరినగ్రంథ ముచితముగా నొసంగబడును.

## —| బహుమానగ్రంథముల పట్టిక |—

1. ఉగ్రభైరవము:—డిటెక్టివ్ నవల 160 పుటలు కేలికో బైండు చిత్రపటశోభితము.
2. పద్మరాగము:—డిటెక్టివ్ నవల 245 పుటలు.
3. చపల లేక చాంద్‌బీబీ:—డిటెక్టివ్ నవల 2
4. కాళీఘట్టరహస్యములు (The Myster నవల 272 పుటలు.
5. విషమరహస్యము:—డిటెక్టివ్ నవల 220 పు
6. దుర్గాదాసు:—(5 అంకముల నాటకము)
7. కాంతాపహరణము:—(5 అంకముల నాటకము)
8. ప్రణయసామ్రాజ్యము:—నవల చక్కని గ్లేజు కాగితముపై ముద్రితము.
9. ఉత్తమవంచకుడు } (The Righetous Rogue) హాస్యరసప్రధానము,
మురళీధ్వని } భావకవిత.




భాగవతుల నృసింహశర్మ,
వేగుంజుక్క- గ్రంథమాల,
పూడిపెద్దివారివీధి, బరంపురం.
గంజాంజిల్లా.

# సమాలోచన.

**విచిత్రమాసపత్రిక. సం॥ ౧కి॥ చందా రు 4-0-0 మాత్రమే.**

వేగుఁజుక్క గ్రంథమాలవారి యాజమాన్యమున ప్రతిమాసమును వెలువడును. ఇదివరకు వేగుఁజుక్క కథావళి ప్రచురింపబడియు కారణాంతరములవలన నేతత్ప్రచురణకార్యము విరమింపవలసివచ్చెను. కాని పలువురు చందాదారుల ప్రోత్సాహమున నేడు మఱల నీసమాలోచనపేర మాసపత్రికను ప్రచురింప సమకట్టితిమి. జయప్రదముగ నీయుద్యమమును కొనసాగించుభారము చందాదారులయందును ఆంధ్రసారస్వతాభివృద్ధిని గోరు తదితర ఆంధ్రసోదరులయందును పెట్టితిమి. ఇందు పూర్వకవులయమూల్య శృంగారప్రబంధరాజములను సనాతన ధర్మముల నుద్బోధించు వ్యాసములును, భక్తి నెలకొల్పు విషయములును, మతసాంఘిక దేశీయ వివిధవిషయములును సాంఘిక చరిత్రాత్మక నిరూపక నవలలును ఆవశ్యప్రాచీనుల మహామహుల యమూల్యవ్యాసములును బ్రచురింపబడును. వివిధపత్రికలు జూడనవసరములేకయే మాసమాలోచన పత్రికను గమనించిన సర్వవిషయములు దెలియగలవు. ఈపత్రికకు చందాదారులు కాఁగోరువారు వెంటనే తెలియజేయుఁడు.

భాగవతుల నృసింహశర్మ.

---

## అచ్చుతప్పులు.

| పేజి. | పద్యము సంఖ్య. | తప్పులు. | ఒప్పులు. |
|---|---|---|---|
| 2 | 6 | నొసంగినట్టి | మిసంగినట్టి |
| 14 | 73 | గంటివి | గంటివి |
| 21 | 114 | మిత్రదుఃఖంబు | మిత్రుదుఃఖంబు |
| 21 | 115 | తనదుదుఃఖంబు | ఆత్మదుఃఖంబు |
| 26 | 138 | నాకలోకంబు | నాగలోకంబు |
| 29 | 161 | సకలసామ్రాజ్యంబు | సకలసామ్రాజ్యంబు |
| 30 | 165 | జనించి నాతని | జనించి నాడని |
| 30 | 166 | సుగ్రీవుడాపుడనుచు | సుగ్రీవుఁడాప్తుఁడనుచు |
| 36 | 2[illegible]3 | మణిని ధరించి | మణినిధరియించి |
| 41 | 228 | ఆత్మణంబు | ఆత్మణంబ |
| 43 | 237 | వనజాక్షుఁడు | వనజాతాక్షుఁడు |
| 46 | 257 | ఘనుఁడగుఖ్యాతి | ఘనుఁడనుఖ్యాతి |
| 49 | 272 | స్వార్థహితుని | స్వార్థరహితుని |
| 63 | 347 | నాచరాచర | ఁజరాచర |
| 69 | 383 | మతనములాడి | మంతనములాడి |
| 85 | 475 | వత్తునియొ | వత్తుననియొ |
| 88 | 480 | యంతలుదైనను | యొంతటిదైనను |

మఱియుఁ గొన్నితప్పులుండవచ్చును. దిద్దుకొని చదువుకొనవలెనని ప్రార్థన.

# "రాష్ట్రేతరాంధ్రులు" Andhras Abroad

ఇదియొక ఆంధ్రమాసపత్రిక. క్రౌన్ ¼ సైజున ముద్రింపబడుచున్నది. సంవత్సరచందా ఒక రూపాయి ముందుగా చెల్లించవలెను. ఖరగపురము ఆంధ్రజనసంఘమువారి యాజమాన్యమున ప్రకటింపబడుచున్నది. దీనికి ముఖ్యసంపాదకులు ఆంధ్రసభారత్న భండారు దండపాణి పంతులుగారు. ఇందు సాంఘిక, ఆర్థిక, విద్యా, ఆరోగ్య, పారిశ్రామిక, నైతిక, వాఙ్మయ మతవిషయములగూర్చిన వ్యాసములుండును. రాష్ట్రేతరాంధ్రులం దాంధ్రత్వము స్థిరత్వము వహించునటుల జేయుటయును, ఆ ధ్యేయప్రచారము గావించుటయును, ఆంధ్రులకును ఇతరజాతులవారికిని నడుమ పరస్పరసోదరభావము పెంపొందించుటయును, రాష్ట్రేతరాంధ్రుల సాంఘిక కార్యములనెల్ల కేంద్రీకరించుటయును నిరంతరకృషి సేయును. రాష్ట్రీయ, రాష్ట్రేతర ఆంధ్రులెల్లరును స్త్రీపురుషవిచక్షణలేక చదువవలసిన పత్రికారాజము. రాష్ట్రేతరాంధ్రుల నడుమ ప్రచారము గోరువారు "రాష్ట్రేతరాంధ్రులందు" ప్రకటించినచో మనోరథసిద్ధి నందగలరు. వివరములు గోరువారు :—

"ఆంధ్రజనసంఘ గౌరవ కార్యదర్శిగారికి, ఖరగపురము"

అని వ్రాయనగును.

# దేశబంధు.

ఇదియొక చక్కనిమాసపత్రిక. ఇందు చదువరుల కానందము కలిగించుకథలు యోగ, వైద్యవిషయములు, ప్రహసనములు, ఏకాంకనాటకములు చక్కగానొక్క సంవత్సరములో గీర్వాణ భాషయందు పాండిత్యమును కలిగించు పాఠములు వార్తలు మున్నగు ననేక విషయములతో పేరుపొందిన పత్రిక.

సం॥ చందా రూ. 3. దేశబంధు పత్రిక, కడ్డేపల్లి, తూప్రాన్ పోస్టు

# భారతీగ్రంథమండలి, సత్తెనపల్లి.

1 విజయ:—ఇయ్యది చరిత్రాత్మక పరిశోధకనవల. ఆంధ్రయువతీలలామ ధైర్యసాహసముల కునికిపట్టు. వెల 1-0-0.

2 హిమ్మత్ సింగు:—చరిత్రాత్మకమగు నవల. 268 పుటలు. ఇది చదువనిదే భారతీయుల మని గర్వింపకుడు. వెల రు. 1-8-0.

3 లోకనాయకిశతకము:—భక్తిప్రతిపాదకము. వెల 0-8-0.

గమనిక:—పైమూడును నొకసారికోరిన సగము వెలకే యొసంగబడును. ఖర్చులుప్రత్యేకము. ప్రతులు చాలస్వల్పముగ నున్నవి. వలయువారు త్వరపడవలెను. ఈ యవకాశ మొక నెలవఱకు మాత్రమే. కరుణను గోల్పోయి విచారింపకుడు.

# ప్రధానపోషకులు.

1. M. R. Ry. I. V. Sivaramadass garu, Mokhasadar
Narasingaraopuram.

2. ,, K. Krishna Rao garu, Land lord,
Berhampore.

3. ,, K. Gurnadha Rao garu, proprietor,
I. L. P. Press, Berhampore.

---

# రాబోవు గ్రంథములు.

1 లీలాకుమారి:—అత్యద్భుతమైన నవల దరిదాపు 300 పుటలుండవచ్చును.

గ్రంథకర్త:—పోలవరపు రామబ్రహ్మముగారు B A జిల్లా కోర్టువకీలు రేపల్లె, గుంటూరు.

2 "తైమూర్":—నిరూపకనవల, హంతకుఁడత్యద్భుతసాహసాగ్రగణ్యుఁడు. తుదిముట్ట జదువనిదే విడువరు.

గ్రంథకర్త:—K. V. గోపాలరావుగారు.

3 "పిశాచసందర్శనము":—ఇది నవలా? నాటకమా? దీనిఁగూర్చి యేమనివ్రాయవలెను. యథార్థములగు సంఘటనములు గలిగి, చదువుచున్న వారలందఱొడలు పులకరింపఁజేయు సంగతులతో మెండుగ నిండుకొన్న యీగ్రంథము నెల్లరుఁ జదివి యానందింపకపోరు.

గ్రంథకర్త:—S. V. రామమూర్తిగారు B. A. L.T.

# సరసశృంగారము.

లేక

# హేమసుందరోపాఖ్యానము.

ధరతగ్గినది. గమనింపుఁడు:

ఇది నీతిబోధకమైన పూర్వకవిప్రణీత అపూర్వపద్యకావ్యము. ఇందలి నాయికానాయక శృంగారచేష్టలతిమనోహరములు. హావభావవిలాస శృంగారప్రదర్శనమున కిది నిదర్శనము. ఇదివఱ కాంధ్రలోక మెఱుంగని గ్రంథరాజము. చక్కని 700 పద్యములు గలవు. ఫెదర్ వెయిటు కాగితముపై ముద్రితము. నిండు కేలికో బైండు. ముద్దులొలుకు అచ్చు. స్వర్ణాక్షరాలంకృతము. చిత్రపటశోభితము. చందాదారులకు ఖర్చులతో సహా రు 1-10-0. ఇతరులకు ఖర్చులతో 2-8-0 నుండి ఖర్చులతో రు 2 0 0 లకు ధరతగ్గింపఁబడెను. కొలఁది ప్రతులు మాత్రమే గలవు. త్వరపడుఁడు. ఆంధ్రపత్రికయందు 1924-25 సం॥ లో కొన్ని మాసములపర్యంతము మిక్కిలి గొప్పగా ప్రశంసింపఁబడిన గ్రంథరత్న మిదియే యని పాఠకు లెఱుంగవలెను.

మచ్చునకు రెండు పద్యము లుదహరించుచున్నాము.

ఉ. "గాయకులార మేల్కొనుఁడు । గానకళాభ్యసనార్థ మంగనా
నాయకులార లెండిఁక పు । నారతికిన్ విదురింపుఁ డింక భూ
నాయకులార" యంచుఁ దమ । జ్ఞానముఁ దెల్పెడురీతిఁ "గుక్కుటో
కో" యని కోళ్ళుకూసినవి । కొండల బల్లెలఁ బట్టణంబులన్.

చ. ఆటవెలందికిం దగిన । యందముఁ జందము లేకయుండినన్
బైటను జార్చనేర్పు, చను । బంతులఁ జూపియు జూపనట్టి స
య్యాటలు మందహాస పరి । హాసములున్ నవుఁ బువ్వుఁదేనెబోల్
మాటలుఁజాలు మా పురుషు । మందులు మాకులుఁ బెక్కు లేటికిన్.

వలయువారు :—

భా॥ నృసింహశర్మ.
వేగుఁజుక్క గ్రంథమాల,
పూడి పెద్ది వారివీథి.
బరంపురం (గంజాం)

# రాబోవు శృంగార ప్రబంధములు-గమనింపుడు.



(1) రత్నావతీ పరిణయము :—

రేకపల్లి సోమనాథకవి ప్రణీతము.

(2) శృంగార సుధాసముద్రపూర్ణ చంద్రోదయము:—

చెన్నూరి శోభనాద్రి ప్రణీతము.

(3) బలరామచరితము:—

గుడారు వెంకటదాస విరచితము.

ఇట్టి అముద్రిత ప్రబంధరాజము లెన్నియో యున్నవి. ఇయ్యవి కష్టముపైని సంపాదించి పాఠకుల కందజేయ నుత్సహించుచున్నాము. ఈ కార్యమునకు చందాదారులును తదితర ఆంధ్రమహాజనులును తగినంత ప్రోత్సాహ మొసంగిననే కాని మా యీప్సితము నెఱవేఱదు. పూర్వకవిప్రణీత అముద్రిత ప్రబంధములపై యభిమాన మున్నవారు వెంటనే వేగుంజుక్క గ్రంథమాలకు చందాదారులుగ జేరుడు. ప్రవేశరుసుము మీ రొసంగ నక్కరలేకయే మా నరసశృంగారగ్రంథము నొక ప్రతికి వెంటనే ఆర్డరును పంపుడు. ఖర్చులతో సహా మీకు రు 2-0-0 లకే వి.పి. పంపఁబడును మీరు చందాదారుల పట్టికయందు జేర్పఁబడి, చందాదారుల కొసంగఁబడిన లాభములన్నియు మీకు సమ్మత మొసంగఁబడును. గ్రంథమాలయందు ప్రచురింపఁబడు ప్రతిగ్రంథమును మీకు పంపఁబడును.

భా॥ నృసింహశర్మ.

వేగుంజుక్క గ్రంథమాల,

పూడిపెద్ది వారివీధి.

బరంపురం (గంజాం)

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ తులసీరామాయణము

## కిష్కింధాకాండము.



క. పావనిసేవితపదరా
జీవా! నతసర్వజీవ! సుస్నేహాదృతసు
గ్రీవా! కరుణాపూరిత
భావా! బాహాబలజిత పంక్తిగ్రీవా! 1

శా. కుందేందీవరసుందరాంగములతో గోసాధుభూదేవతా
సందోహావనదీక్షితో, దనుజశిక్షాదక్షులై, మానిరా
డ్బృందం బెంతయు సంతసింప, సతిసన్వేషించుచున్ బోవు గో
విందాంశోద్భవులన్ రఘూద్వహుల సంప్రీతిన్ బ్రశంసించెదన్. 2

క. వరధన్వుల శ్రుతిసన్నుత
వరచరితుల, ధర్మకర్మపరులన్ మాయా
నరులన్, ముష్కరరిపుభీ
కరులన్, విజ్ఞానరత్నఖనులన్ గొలుతున్. 3

చ. కమలజవార్ధిజంబు, కలికల్మషనాశన మవ్యయంబు, మా
రమణము శోభసుందరవరంబు, శుభప్రద, మెట్టివారికేన్
సుమధుర ముగ్రసంసరణశోకరుజాపహారంబు, రామనా
మ మనుసుధారసంబు మతిమంతులు గ్రోలెద రెల్లవేళలన్. 4

ఉ. తా నివసించి భక్తజనతాపము బాపము సంహరించి, వి
జ్ఞానమణీవితానఖనినా భువి రాజిలఁజేసి, ముక్తికిన్
స్థానముగా నొనర్చి మునిసంతతి సంతతమున్ నుతింపఁ, గా
శీనగరంబు క్షేత్రముగ జేసినశంకరు సన్నుతించెదన్. 5

గీ. భూరిదుగ్ధపయోధి సంభూతమైన
గరళమునొ నంగినట్టి యుక్కసటువోవ
రామనామామృతంబు శ్రీరామయంబుఁ
గాలకంఠుండు సతతంబుఁ గ్రోలుచుండు. 6

గీ. కాశివాసికెక్కను పుణ్యరాశియనఁగ
నచటమరణించుజీవుల నాదరించి
రామతారకనామమంత్రమును జెప్పి
మోక్ష మిచ్చుచునిటలాక్షుఁ బొగడవలదె. 7

శా. మంథానాద్రినిబోలు రామకథ సంసారాబ్ధి కూహింపఁగాఁ
కంథా వాటము జ్ఞానరత్నఖనికిన్, కైవల్య విద్యాసుధా
సంధానంబు గ్రహింపుమా వినుమ యోశైలాత్మజా యంచుఁ గి
ష్కింధాకాండము నిట్లు చెప్పఁదొడఁగెన్ శ్రీకంఠుఁడుత్కంఠతో.

మ. వినిపింతున్ వినుమా నిరంతర మహావృత్తాంత మాద్యంతముం
తనుమధ్యా! వనజాతనేత్రుఁడు సుమిత్రాపుత్రుఁడానిర్జనో
ర్విని సీతారమణీశిరోమణిని నన్వేషించుచున్ ఋశ్యమూ
కనగంబున్ గని విశ్రమించి రతిదుఃఖప్రేంఖితస్వాంతులై. 9

చ. ధరణిఁ ద్యజించి, కన్నతలిదండ్రులఁ బాసి, సమస్తరాజ్యమ
స్థిరమని యెవగించి, చనుదెంచిరి కాననవీథి కాత్మలో
నెరియక; యిప్పు డిట్లు ఘటిల్లినదంచుఁ దలంకి వెన్కకుఁ
దిరుగరు నొచలింప రిది ధీరులలక్షణ మంబుజేక్షణా! 10

గీ. ఋషుల కావాలమైన యాఋష్యమూక
గిరిని విశ్రమించిన వీరవరులఁ జూచి
వాలిభయమున నచటఁ బ్రవాసమున్న
సూర్యునిసుతుండు హనుమంతుఁ జూచి పలికె. 11

"గీ. చూచితే వార లెంతటి। శూరవరులొ ?
అఖిలకష్టంబులంబడి । యరుగుదెంచు
నరణి గన్పట్టెడిన్ వారి। జాడఁ జూడ
నరిగి పరికింపవలె వారి। చరిత మనఘ ! 12

ఉ. భూతలనాథులో? పురుష। పుంగవులో? యెవరో గ్రహించి, సాం
కేతికసంజ్ఞతోడ నెఱిఁ। గింపు మొకప్పుడు వాలిపంపఁగా
నీతల కేగుదెంచిరని । యెంచితివేని ముఖంబువంచు మో
వాతతనూజ ! తత్క్షణము । పాఱెద నీగిరిఁ బాసి కానకున్. 13

గీ. అనిన సుగ్రీవునానతి । నవధరించి
బ్రాహ్మణబ్రహ్మచారిరూ। పము ధరించి
వీరరాఘవసింహులు । విశ్రమించు
స్థలమునకు నేగె ననిలనం। దనుఁడు ఘనుఁడు. 14

గీ. స్వస్వరూపంబు వెలికిఁ గ। న్పట్టకుండ
మస్తకమువంచి భక్తిన। మస్కరించి
మౌనులంబోలు రామల। క్ష్మణుల పొంత
నిలిచె నమ్రుఁడై వానర। కులవరుండు. 15

సీ. రామసౌమిత్రులఁ । బ్రహ్మర్షివరు లంచు
నెంచి భక్తి నమస్క। రించె నొక్కొ ?
దివ్యరూపులు వీరు । దేవాంశభవులంచు
వినతుఁడై మొక్కు లర్పించె నొక్కొ ?
శ్రీరామలక్ష్మణుల్ । చిద్విలాసులయంచుఁ
దలపెట్టి నమ్రుఁడై । నిలిచెనొక్కొ ?
మూలవిరాట్టిట్లు । పుణ్యాకృతులఁదాల్చి
యేతెంచెనోయని । యెఱిఁగె నొక్కొ ?

గీ. పుణ్యపురుషులఁ జూచున । న్వాడు నమస్క-
రింపవలెనంచు నట్లొన । రించె నొక్కొ ?
సకలగుణధాముఁ డగు రామ । చంద్రునందు
ఏమిపరికించెనో యాత । డెఱుఁగుఁగాక. 16

"మ. నరనారాయణులో, భవాంశభవులో, । నన్నేలు పుణ్యాత్ములో?
ధరపైఁబుట్టిన యాయనంతులొ, యనం । తజ్ఞాన సంపన్నులో ?
హరులో, సిద్ధులొ, సాధ్యులో, గరుడులో । యక్షప్రభూత్తంసులో
నరులో, కిన్నరులో? యెఱుంగనగునా । నాబోఁటికిన్ జెప్పుడీ. 17

ఉ. ఇమ్ముగ జ్ఞానచంద్రికల । నీనెడు మోముఖపూర్ణచంద్ర బిం
బమ్ములు, ఫుల్లపద్మముల । వైఖరిమెచ్చని మీవిశాలనే
త్రమ్ములు, ధర్మదేవతకు । స్థానములైన పవిత్రగాత్రసౌ
మ్యమ్ములు, మీర లిర్వురు న । మానుషవిగ్రహు లంచుఁదెల్పెడున్.

గీ. ఇంద్రనీలంబు స్వర్ణంబు । నిట్లు మాన
వాకృతులఁ దాల్చి యేతెంచి । నట్టులున్న
మీర లిరువురు నెవ్వరు ? । వీరవరులు
ధీరవరు లని మీతీరు । తెలియఁజేయుఁ. 19

సీ. కంటకావృతఘోర । కాంతారకఠినత
నీపాదపద్మంబు । లెట్లు లోర్చె ?
గ్రీష్మాదిదుస్సహా । ఋతువులబాధల
నీకోమలాంగంబు । లెటుసహించె ?
మణికిరీటములకు । మండనంబులఁ బోలు
నీతలల్ జటల ని । ట్లేలదాల్చె ?
బ్రహ్మవిష్ణుమహేశ్వ । రత్రిమూర్తులలోన
నెవరు మీరు? తృతీయుఁ । డచటి కేగ ?

గీ. ధరఁ బరోపకారార్థ మిదంశరీర
మనెడు నార్యోక్తిఁ బాలింప నరుగుదెంచు
క్షత్త్రియులొ మీరు? నాకు సంశయము దీఱ
నార్యవరులార! దయయుంచి యానతిండు.

క. ధరణిన్ గాపాడఁగ నిదె
తరుణం బని లోదలంచి ధర్మావనత
త్పరులై యీగతి మాయా
నరులై చనుదెంచిన నరనారాయణులా?"

క. అనినన్ విని హనుమంతునిఁ
గని తన్మృదువాక్యదేవగానామృతమున్.
దనివోవఁ గ్రోలి రాముఁడు
వినిపించె స్వకీయగాథ విశదముగాఁగన్.

"చ. అనఘ! యయోధ్యకున్ దశరథావనినాథుఁడు పాలకుండు, మా
జనకుఁ డతండు, మే మతని సత్యవచఃపరిపాలనార్థమై
వనమున కేగుదెంచితిమి; భాస్కరవంశము మాది, వీఁడు నా
యనుజుఁడు లక్ష్మణుండు సుజనావనదక్షుఁడు, నేను రాముఁడన్. 21

గీ. భరత శత్రుఘ్ను లనఁగ సోదరులు గలరు
పురవరంబున; మాతోడఁ బొలఁతి యొర్తు
అరుగుదెంచె, నా పెను దైత్యు లపహరించి
రెచటనున్నదో వెదకెద మెఱుక లేక. 22

గీ. బ్రహ్మసుతుండవా? యంభోజసంభవుఁడవో?
సాధుజనకింకరుండైన శంకరుఁడవో?
నీకు వృత్తాంతమంతయున్ దెలియఁజేసి,
మానసమస్కారములఁ గొమ్ము జ్ఞాననిలయ!" 23

క. శ్రీరామునివాక్యసుధా
ధారలఁ దోఁగి దోఁగి । "ధన్యుఁడ నైతిన్.
ప్రారబ్ధ లబ్ధఫలమున
శ్రీరామా విభునిఁ గంటిఁ । దృప్తిం గొంటిన్." 24

చ. అనుచు నమస్కరించి, నయ । నాంబుజబాష్పమరందధారలన్
తనుపులకాంకురంబులకు । దౌహృదమున్ బొనరించి, రామునిన్
మనమునఁ గొల్చి, దేవనుత । మంగళవిగ్రహదివ్యరూపద
ర్శనము లభించె నంచు మది । సంతస మొంది వచించె నీగతిన్.

క. భవదీయదివ్యమాయా
వివశాత్ముఁడనై విమోహ । విభ్రాంతిని నీ
వెవఁడవొ గ్రహింపఁజాలక
అవివేకము వెల్లడించి । యజ్ఞుఁడ నైతిన్. 26

గీ. హీనసంకల్పమతిని ని । న్నెఱుఁగలేక
జ్ఞానమున్ దక్క ప్రశ్నించి । జడుఁడ నైతి
నీ వెవండవొ యూహింప । నావశంబె?
నన్నెఱుంగవె వైకుంఠ । నాథ చెపుము. 27

చ. అరయిక లేని పామరుని । యట్లు నటించెను, నీదు మాయచేఁ
బొరవడితిన్ భవచ్చరిత । ముల్ దలపోయక మోసపోతి; నీ
చరణములన్ భజించి భవ । సాగరమీఁది తరింపనున్న కిం
కరుఁడను, వానరుండ, నను । కంపవహింపుము, యుద్ధరింపుమా. 28

గీ. సర్వశక్తిసంపన్నుండు । సర్వసాక్షి
రాముఁ డమృతధాముండు, నా । ప్రభువరుండు;
సేవకుఁడు స్వామికంటెను । శ్రేష్ఠుఁడగునె?
ఎట్లఱుంగుదు నీమాయ । నివకు లేక? 29

క. చైతన్యమూర్తి వని నేఁ
జేతంబున నెఱుఁగలేక । చింతిలితిన్ నీ
వేతన్మాత్రుఁడ వనుచున్
నాతప్పు క్షమింపు మనఘ! । నతసేవకుఁడన్. 30

గీ. నీదు మాయావిమోహిత । నిఖిలజీవ
ములకు నీకృపచేఁ గాదె । ముక్తిఁ గలుగు
నాదువాక్యంబులకుఁ బ్రమా । ణంబ వీవు
నిరుపమాకార! రఘువీర! । నిర్వికార! 31

ఉ. జ్ఞానపథానువర్తినయి । నా ప్రభువర్యు భజింపఁగోరెదన్
గాని, తదన్యమున్ దెలియఁ । గా మదిలోఁ దలపోయ స్వప్నమం
దైనను, తండ్రిఁగాక సుతు । డన్యుని నమ్మునె? స్వామిఁ బాసి యే
మానవునైన సేవకుఁడు । మానసవీధిని విశ్వసించునే? 32

గీ. భక్తుఁ బోషింప రక్షింపఁ । బ్రభువరుండు
నిలిచియుండఁగ సేవకుల్ । నిర్భయముగ
వసుధనెల్లెడ విహరింప । వచ్చుఁగాదె
మానిహితకామ! శ్రీరామ! । మధురనామ! 33

చ. అని వినుతించి, రాఘవుప । దాబ్జయుగంబున వ్రాలి, భక్తిమైఁ
గనులను మోడ్చి, మేనఁ బుల । కల్ తలలెత్తఁగ లేచి తత్క్షణం
బున నిజవానరాకృతిని । బొల్చినయంతనె రామచంద్రుఁ డా
హనుమను కౌఁగిలించుకొనె । నత్యనుకంప రహింప నింపుగన్. 34

గీ. అన్యరూపంబుఁ దాల్చిన । యంతవఱకు
హనుమకున్ దూరముగ నున్న । యట్టి రాముఁ
డపుడు దగ్గర కేతెంచి । యతనిఁ బట్టి
కౌఁగిటన్ జేర్చెఁ బ్రేమంబు । గడలుకొనఁగ. 35

గీ. కనుల నానందబాష్పంబు । లను త్యజించి
రామచంద్రుండు భక్తుశీ । ర్షంబుఁ దడిపెఁ
బ్రేమరసమున స్నాతుఁడై । హృదయతాప
మణఁగెనని సంతసించె న । య్యనిలసుతుఁడు. 36

గీ. అంత మార్తాండకులవర్యుఁ । డాదరమున
ననిలసుతుఁ గాంచి యాతని । యాత్మ నెఱిఁగి
భక్తజనశేఖరుం డను । భావమునను
ఇట్టు లనియెను తనప్రేమ । మినుమడింప. 37

"మ. అనుమానింపకుమోయి, నీసహజసౌ । హార్దంబు, నీవర్తనం
బనురాగాంకురదోహదం బనుచు నే । నామోదమున్ బొందితిన్
వినుమా, లక్ష్మణుకంటె నిన్ ద్విగుణిత । ప్రేమంబునన్ జూచి నీ
కనుకూలించెద నీపరిస్థితుల నే । నాలించి పాలించెదన్. 38

గీ. అఖిలజీవులఁ బ్రేమించి । యాదరించి
అన్యగతి నెఱుంగక న । న్నహర్నిశంబు
విశ్వసించి భజించి సే । వించునట్టి
భక్తవరునకు నేను సే । వకుఁడ ననఘ! 39

గీ. ఈచరాచరసృష్టియుం । దెల్లయెడల
గోచరించెడువాని సం । కోచ ముడిగి
నిశ్చలంబగుభక్తి ధ్యా । నించునట్టి
ఆర్యవర్యుండు నాకుఁ బ్రే । మాస్పదుండు." 40

క. అనియిట్లు కూర్మిఁబలికిన
వనజాక్షుని సుప్రసన్న । వదనముఁగని యా
హనుమంతుఁడు నెమ్మనమున
ననలేనిప్రమోదమొంది । యిట్లనె భక్తిన్. 41

ఉ. ధీవరుఁ డార్యసజ్జనవిధేయుఁడు, సద్గుణమండనుండు, సు
గ్రీవుఁడు సుస్వభావుఁడు గిరిం నివసించుచున్నవాఁడు, మీ
సేవకు మైత్రికిం దగినశిష్టుఁడు వానరనాథుఁ డాతఁ డో
శ్రీవర! రామభూవర! విశిష్టజనావన! లోకపావనా! 42

గీ. అతనికష్టంబు వారింప నభయ మొసఁగి
స్నేహముం జేసితిరయేని శీఘ్రముగను
వానరులఁబంపి మీకార్యభార మూని
సతియుదంతంబుఁ దెలుపు నిస్సంశయముగ. 43

మ. అని శ్రీరాముని లక్ష్మణుం దనవిశాలాంసద్వయిం బూని చ
య్యన శైలాగ్ర మతిక్రమించి తన కై యచ్చో నిరీక్షించువా
నిని సుగ్రీవునిఁ గాంచి ముందు నిలిచెన్; శ్రీరాము దర్శించినం
తనె సుగ్రీవుడు సంతసించె "భళిరా ధన్యోస్మి"యం చాత్మలో.

గీ. "అనఘులార! నాపూర్వపుణ్యము ఫలించె,
సార్థకంబయ్యె నాజన్మ మవనియందు,
ఆదట నలంకరింపుఁ డీయాసనముల
నతులమతులార! నానమస్కృతులఁగొండు." 35

గీ. అనుచు శ్రీరామలక్ష్మణులను నుతించి,
ఆసనాసీనులం జేసి యర్కసుతుఁడు
"ఆత్మభక్తునకుం హితమైనదాని
దైవముఘటించు" నని మదిం దలఁచి యులరె. 46

గీ. అంత మతిమంతుఁ డగు హనుమంతుఁ డలరి
రామసుగ్రీవులం జూచి ప్రస్తుతించి
ఎలమి నన్యోన్యవృత్తాంతముల వచించి
సఖ్యముం గల్పె దేవతల్ సన్నుతింప. 47

గీ. అగ్నిసాక్షిగ శ్రీరాముఁ డభయ మొసఁగి
అతనితో స్నేహమున్ జేసె; నాతఁడాంబ
ఎట్టియాపదవచ్చిన నీడఁబోక
సాయమున్ జేతుననియె భాస్కరసుతుండు. 48

సీ. వహ్నిప్రసాదప్రభావంబునన్ గాదె
యనుజులతో రాముఁ డవతరించె
యజ్ఞాగ్నిహోత్రప్రవార్థంబ స్త్రీహత్య
యనక రాముఁడు తాటకను వధించె
పితృహోత్రుఁడు సాక్షిభూతుండుగా నాఁడు
విలుద్రుంచి రాముండు పెండ్లియాడె
అగ్నిహోత్రమునంద యాత్మరూపము దాచి
సీత మాయామయోపేతయయ్యె

గీ. అగ్నిచే లంకను దహించె ననిలసుతుఁడు
అగ్ని రామాయణమునకు నాదిబీజ
మగ్ని యఖిలజీవులహృదయములఁ గలదు
అగ్ని ప్రత్యక్షదైవతం బండ్రు బుధులు. 49

గీ. అపుడు సుగ్రీవుతోఁడ రామానుజుండు
రాక్షసులు రామచంద్రునిరామ నపహ
రించిన యుదంతమున్ వివరించినంత
నినసుతుఁడు రామునిన్ జూచి యిట్టు లనియె. 50

గీ. అర్కకులుఁడవు నీవు, నే నర్కసుతుఁడ
మనకు సతివియోగంబు సమాన మనఘ!
ఇరువురకు శత్రుసంహారణేచ్ఛ సమము
అర్కతంబున మనసెయ్య మతిశయించు. 51

గీ. మిథిలవంశాభిజాత నీ । వెలఁతమిన్న
మన యపారదుఃఖసముద్ర । మథనమునన
నీదుగృహలక్ష్మి చేకూరు । నిర్మలాత్మ!
కోర్కెలు ఫలించు దైవాను । కూలగతిని. 52

గీ. కార్య మరయుదు మంత్రిశే । ఖరులతోడ
నొక్కనాఁ డిట నేనుండ । నువరినుండి
"రామ శ్రీరామ" యనుచు, వ । స్త్రమునఁగట్టి
ఆభరణములఁబడవైచె । నతివయోర్తు. 53

కం. కనుఁ డీయాభరణంబుల
వనితామణి యేడ్చి నేలఁ । బడవైచిన దో
యినకులతిలకా యని యా
యినపుత్త్రుఁడు ముల్లెఁదెచ్చి । యిచ్చెన్ బ్రీతిన్. 54

గీ. రామచంద్రుఁడు స్వర్ణాభ । రణము లెల్ల
నాతురతఁజూచి గుండెల । కద్ది యేడ్చె
సుదతివస్త్రాభరణములఁ । జూచివావి
పోల్చిచెప్పుమా యనుచుఁ ద । మ్మున కొసంగె. 55

గీ. "నిత్యపాదాభివందన । నియతికలన
జానకీదేవిపాదభూ । షలనుమాత్ర
మేనెఱుంగుదు నన్యంబు । లెఱుఁగ ననఘ!"
అనుచు వచియించి యేడ్చె రా । మానుజుండు. 56

మ. వినుఁడీ రాఘవులార! జానకిని న । న్వేషింప యత్నంబులన్
బొనరింతున్ విరహాగ్నితప్తమతులై । మోహంబుచేఁ గార్యసా
ధనమార్గంబుఁ ద్యజించి రోదనమునన్ । ధైర్యంబు వర్జింపరా
దనిసుగ్రీవుఁడువల్కె రామునకు ధైర్యస్థైర్యముల్ నెక్కొనన్. 57

ఉ. అంతట రామచంద్రుఁడు ద।యాపరతంత్రుఁడు సూర్యపుత్త్రువృ
త్తాంత మెఱుఁగనట్లతని। దాపున నిల్పి వచించె నిట్టు లే
కాంతగుహాంతరంబులను। గాఁపురముండఁగ హేతువేమి? నీ
వింతభయంబునన్ మెలఁగ। నేటికి నా కెఱిఁగింపు మంతయున్.

ఆ. వె. ఈ వెవండవో కృపాళ। యీ వానరులతోడ
నిట్టు లిచటనుండ। హేతు వేమొ?
నీ నివాసమేడ? । నిన్నుఁ గాంచి పెంచిన
తల్లిదండ్రు లెవరు? । ధన్యచరిత! 59

చ. మనుజులమాటలున్ క్రియలు। మన్ననలున్ గనుపట్టు నీ ప్రవ
ర్తనమున, నీశరీరము వి।రాజిలుచున్నది వానరాకృతిన్;
వనరుహసంభవుండు నర।వానరజాతికి మైత్రిఁ గూర్పఁగా
నిను సృజియించెనో? సఖుఁడ! । నీకథ నా కెఱిఁగింపు మిత్తఱిన్.

చం. "వినుఁ డొకనాఁడు బ్రహ్మ తన। వ్రేలను నేత్రమలంబు దీసి నే
లను బడవైచినంత నొక। లావరి వానరుఁ డాక్షణంబునన్
జననముఁ బొందె, వాఁడు బల।సంపదచేఁ దనరున్ సమానుఁడౌ
నటుచు విరించనుం డొసఁగె। సార్థకనామము ఋక్షరాజు నాన్.

గీ. అంత నవ్వానరోత్తముం। డబ్జభవుని
పదముల కెఱఁగి "నీయాజ్ఞఁ। బడసి నేను
చేయఁదగుకార్య మెయ్యది। చెప్పు మనఘ!"
అనిన విని యిట్టులనియె న।వ్వనజభవుఁడు. 62

చ. "వనముల సంచరింపు మని। వార్యబలంబునఁ, బాపకర్ములన్
దనుజులసంహరింపుము ప।థంబున నీ కెదురైనవేళలన్
దినుము ఫలంబులన్ దనివి।దీఱఁగ, మీఱఁగరాని మేటియున్
ఘనతను బొందు ముత్తములఁ। గాచుచునుండుము భూతలంబునన్."

గీ. అనిన విని యాజ్ఞఁ బాలింతు ననివచించి
ప్రియము చెప్పినచో ప్పవ వానరోత్త
ముండు వనముల విహరించు చుండ, నంత
నొక్కనాఁ డాతఁ డడవిలో నొక్కయెడను. 64

క. గుండముఁ బరివేష్టితతరు
కాండము, నానాకుసుమసుగంధాంబుసుధా
భాండముఁ, బ్రఫుల్ల పంకజ
మండముఁ, బరికించెఁ గీశసత్తముఁ డనఘా! 65

గీ. తనదు ప్రతిబింబమున్ గుండమునను గాంచి
ప్రతిఫలించిన తనవికారములఁ జూచి
అన్యుఁ డెవ్వండొ లోఁగలఁ డంచు దలఁచి,
అఱచి, తత్ప్రతిధ్వనులఁ దా నాలకించి. 66

గీ. ఆగ్రహావేశముం బొంది యాక్షణంబ
అందుఁ గుప్పించి, స్నాతుఁడై యరుగుదెంచి
గాత్రమున వింతమారుపు గలిగె ననుచుఁ
జూచుకొనెఁ దాను చక్కని సుదతి యగుట. 67

"మ. భళిరా! యేమిది? తొంటిరూపు తొలఁగెన్ పద్మాక్షినై నిల్చితిన్
గలయో? నిక్కమొ? భ్రాంతియో? యకట నాకర్మంబొ? క్రొందళ్కు బె
ళ్కులుఁ గుల్కుల్ గల కల్కుతోడరొ కా యీగుండంబులోఁ జొచ్చినన్
జలజాతోద్భవు మాయయో? మొఱఁగఁ బుంస్త్వం బెట్లు శిక్షించెనో."

క. "మగతనము పోయె" ననుచున్
"భగవంతుని మాయఁ దెలియ వశమా" యనుచున్
వగబొట్టు వగర్చిన య
వ్వగలాడిని జూచి రుద్రభాస్కరు తెలుపన్. 69

గీ. ఆమె చక్కదనంబుఁ గా। మార్తుఁ డగుచు
నింద్రుఁ డీక్షించి మోహించి । యింద్రియంబు
వెలఁది వాలంబుపై జాఱ। విడిచినంత
వాలి జన్మించె రెండవ। శూలియనఁగ. 70

గీ. ఆమెముఖపద్మముం గని । భాస్కరుండు
వలపుపెంపున వీర్యంబు । నిలుపలేక
పడఁతిగళమునఁ బడునట్లు । విడిచినంత
జనన మొందితి సుగ్రీవుఁ । డనఁగ నేను. 71

గీ. మమ్ముఁ గాంచిన పిమ్మట । మగతనంబుఁ
గలిగె వానరవిభున క। క్కజముదోపఁ;
నతఁడు మాయిర్వురన్ గాని । యబ్జభవున
కీయుదంత మాద్యంతంబు । నెఱుకచేసె. 72

చ. వనరుహసంభవుం డపుడు । వానరనాథునదంతమంతయున్
విని, "భగవత్కృతంబు గమ। నింపఁగరాదు బలీయ మింతకున్
దనయుల నుత్తమోత్తముల । ధన్యులఁ గంటిని లోపమున్నదే"
యని మముఁ జూచి పల్కెఁ జతు। రాస్యములన్ జిఱునవ్వులొల్కఁగన్.

గీ. "ధీరవరులార ! దక్షిణ। దిశకుఁ బోయి
అచటినగరంబుఁ గిష్కింధ । నాక్రమించి
అతులరాజ్యంబు స్థాపించి । యనుభవింపుఁ
డఖిలసుఖముల మీహృద। యంబు లలర. 74

గీ. రఘుకులంబున దశరథ। రాజవరుని
గర్భమున నాదివిష్ణు వా। విర్భవించి
వనములఁ జరించు; నతనిద। ర్శనమువలన
సకలకల్యాణములు మీకు । సంఘటిల్లు." 75

గీ. అట్టిసంభవపువాక్యంబు । లాలకించి
అతనికిన్ మ్రొక్కి కిష్కింధ । కరిగి మేము
సకలరాక్షసవీరుల । సంహరించి
ఖ్యాతిఁగాంచితి మెల్లరు । నభినుతింప. 76

శా. బంధుశ్రేణినుతింప, దుర్భరరణ। వ్యాపార మేపారఁగా
స్కంధావారముఁగూర్చి శత్రునృపులన్ । శాసించి, దుర్వారగ
ర్వాంధాకారిందముఁడన్ యశంబు దశది। గ్భాగంబులన్ నిండఁ గి
ష్కింధారాజ్యము నేలె వాలి విజయ। శ్రీధాముఁడై భీముఁడై. 77

గీ. రావణునితోడి మైత్రి యే। ర్పడినదనుక
వాలి దనుజాంతకుండని । ప్రణుతిఁగాంచె;
నిరుపురకుఁ గామినీవాంఛ । యేకమగుట
వారిసఖ్యంబు క్రమముగ । మేరమీఱె. 78

మ. అదియట్లుండఁగ నాలకింపు మొకనా । డత్యుగ్రవీరుండు, దు
ర్మదహంవీరులసంహరించిన మహా। మాయావి, మాయావియన్
త్రిదశారాతియొకండు, రాక్షసులు ప్రే। రేపింప గర్వించి, న
న్నెదిరింపంగలమేటి యెవ్వఁడని తా । నేతెంచె మావీటికిన్. 79

గీ. వినుము మాయావి దుందుభు । లనెడువారు
మయునికొడుకు లసాధ్యు ల। మర్త్యులకును
అందు మాయావికంటె మ। హాబలాఢ్యుఁ
డతులవీరుండు దుందుభి । యనెడువాఁడు. 80

క. నాతరము గాదు దుందుభి
పోతరమున్ నీకుఁదెల్పఁ । బో తరనికిమేల్
జాతరయగు; వానింగని
కాతరభావంబుఁబొందుఁ । గాలాంతకుఁడున్. 81

క. దుందుభికంఠధ్వని రణ
దుందుభి, యాలించె నేని । ధూర్జటికైనన్
దుందుడుకుఁ బుట్టు; వానికిఁ
దుందుభమగు నట్టిబలుని । దోర్బలమైనన్. 82

గీ. అనఘ మాయావియనువాఁ డ।హంకరించి
పురబహిర్ద్వారమున నిల్చి । బొబ్బరించి
రమ్ము రమ్మనినంత శూ।రవరుఁడైన
వాలి జృంభించె లయకాల।శూలిఁ బోలి. 83

గీ. కాలమేఘగర్జారవం । బాలకించి
చెలఁగి సింహంబు మాఱుగ।ర్జించునట్లు
బొబ్బరించిన మాయావి।యు బ్బణంప
వాలి గర్జించె దశదిశల్ । వణఁకునట్లు. 84

గీ. శాత్రవవిజృంభణంబు నే।మాత్రమైన
నోర్వఁజాలని వాలి య।త్యుగ్రుఁ డగుచు
నిజభుజాస్ఫాలనధ్వని । నింగిఁ దాక
రమ్మురమ్మని వానియు।రమ్ముఁ బొడిచె. 85

చ. పిడుగులురాలునట్టు పృథి।వీస్థలి కంపిల, వాలియేపుమైఁ
బొడిచినయొక్కపోటునకుఁ । బోఁకముబింకముఁ దక్కి వాఁడు వ
ద్విడి నికటస్థపర్వతద।రీందరిముఁ జొచ్చినయంత, వాలియున్
విడువక వెంబడించె నట।విన్ గలసత్త్వము లెల్ల భీతిలన్. 86

చ. "గిరిదరి పొంతనిల్చి పరి।కించుచు నుండుము వీనిఁజంపి స
త్వరముగ నేగుదెంతు"నని । వాలి ననుం గని పల్కినంత, సు
స్థిరముగ ధైర్యమున్ హృదయ।సీమను నిల్పి చలింపకుండఁ గం
దరమును గాచి నే నిలిచి।నాడను మాసము దాక మిత్రమా !'

గీ. వాలి రాలేదు, శైలగహ్వరమునుండి
భూరిరక్తప్రవాహంబు పొరలివచ్చె;
సంచలించితి వాలినిఁ జంపినట్టి
అసుర చనుదెంచి ననుఁజంపు ననితలంచి. 88

ఉ. వాలినిఁ జంపినట్టి బలవంతుఁడు నన్ను వధింపకున్న, మా
ప్రోలు జయింపకున్న యని పొక్కితి నేమియుఁ బాలుపోక; ప్రా
ల్మాలిక నిల్వరా దిఁకఁ బలాయనమే తగుకర్జమంచు, నా
శైలమునుండి పర్విడితిఁ జయ్యన నాత్మపురంబుపొంతకున్. 89

చ. కనువిడి పీనుఁగొచ్చి మది స్వాస్థ్యముఁబొందితి, వాలి వైరిచే
మరణము బొందియుండునని మంత్రులకున్ గలయాప్తకోటికిన్
జరిగినదంతయున్ దెలిపి చాలదినంబులు వేచి వేచి వే
సరితిని; యంత నొక్కదివసంబున మంత్రులు పల్కిరీగతిన్. 90

క. "పంపాపురవాసుల నను
కంపామతి నేలఁదగిన ఘనుఁడవు, పురిఁ బా
లింపుము, దుఃఖంబును చా
లింపుము, సుఖియింపు మింక క్లేశం బేలా?" 91

ఉ. ఇంతకు దుఃఖభారమున నేడ్చినఁ జచ్చినవారు వత్తురే?
చింతకుఁ జిక్కి యీగతిఁ గృశించి నశించిన లాభమున్నె? ధీ
మంతుఁడ వాలకింపు మనుమానము బొందక రాజ్యమేలి సా
మంతులు మేలనన్ బ్రజలమన్ననలన్ గొను మర్కనందనా" 92

గీ. వలదు వలదంటి, వినక నిర్బంధమునను
పట్టముం గట్టి వెడలిరి పౌరవరులు;
ప్రజల కనుకూలముగ రాజ్యభార మూని
జడుపుతో నిట్లు కాలంబుఁ గడపుకొంటి. 93

ఉ. అంతట నొక్కనాఁడు ప్రళయార్కనిబింబముఁబోలు మోముతో
నంతకుఁబోలి వాలి భయదాకృతితో వడి నేగుదెంచి, యా
శాంతములన్ ప్రతిధ్వనిబయల్పడ హుమ్మని హుంకరించి, నా
చెంతను నిల్చి నన్నుఁగని ఛీ యని కన్నులు జేవురింపఁగన్. 94

చ. పటపట దంతముల్ గొఱకి వాల మొకించుక మీఁదికెత్తి, యు
త్కటముగ ఘర్మజాలము ముఖంబునఁ గ్రమ్మఁగ నంగ "ద్రోహి వై
యిటకరుదెంచి నేను గతియించితి నంచుఁ దలంచి, నాపురం
బటమట నాక్రమించి తకటా! కపటాత్ముఁడ సోదరుండవే? 95

గీ. ఏను మాయావిని వధింప నేగినంత
నదను చేకూరెనని యెంచి యాక్షణంబ
యిచటి కరుదెంచి నాపురం బేలుచుంటి"
వనుచు రోషించి దూషించె నంతఁ బోక. 96

ఉ. ఈశ్వరసాక్షిగా రఘుకులేశ్వర నిక్కముఁ జెప్పుచుంటి, రూ
క్షస్వరగద్గదంబున వెసన్ నను గట్టిగఁ దిట్టి కొట్టి, స
ర్వస్వము స్వీకరించి, బహుభంగుల నే బ్రతిమాలుచుండినన్
భాస్వరగాత్రి నాదుకులభామినిఁ బట్టి బలాత్కరించుచున్. 97

క. తారను, సురుచిరనఖజిత
తారను, నావలపుఁబెంచుదారను, ప్రేమా
ధారను, సముదారను నా
దారను గొనె నేను బాష్పధారను విడువన్. 98

ఆ. వె. ఒక్కవాలి తక్క యొక్కలుం డెవ్వఁడు
నన్ను గెలువలేఁడు నలిననయన!
వానిపేరు విన్న వణఁకుఁబో నామేను,
వాలి కలిసచ్చి వచ్చినాఁడ. 99

సీ. నిత్యజయావాల నిరుపమకరవాల
వాలఖండితదానవాలి వాలి
నిర్వక్రవిక్రమగర్వధూర్వహసర్వ
శూరగజాసురశూలి వాలి
ప్రస్తుతప్రత్యర్థి బలశాలి కులవన
కీలితలయకాలకీలి వాలి
దుష్టనికృష్టారిదుష్కర్మమర్మ దు
ర్మదవంకతీవ్రాంశుమాలి వాలి
గీ. వాలవిక్షేపణోద్భూత పవనచలిత
సప్తసాగరవేష్టితశైలి వాలి
వ్యగ్రుఁడై వాలి యుగ్రుఁడై యాగ్రహించి
నిగ్రహించిన నెవ్వాఁడు నిలువలేఁడు. 100

ఉ. రావణకుంభకర్ణముఖరాక్షసకోటి నదర్పఁజాలు ను
గ్రుఁడ నేను, వాలి నెదిరింపఁగఁజాలను, హేతు వేమనన్
దేవవిభుప్రదత్తరమణీయమణీమహిమాన్వితుం డతం
డోవనమాలి! వాలి నెటు లోర్వఁగవచ్చును సంగరంబునన్.
గీ. శత్రుభయమున సకల దేశములఁ దిరిగి
ఘనుఁ డగుమతంగముని శాపకారణమున
నిచ్చటికి వాలి రాఁడని యీనగేంద్ర
మున వసించుచునుంటి నో యినకులేంద్ర! 102
చ. అనవుఁడు రాముఁ డిట్లనియె నర్కసుతుంగని "మిత్రరత్నమా!
వినిమొద, వాలి నేటికిశపించె మతంగమహామునీశ్వరుం
డనఘుఁ డకారణంబుగ దురాగ్రహ ముందునె? యాత్మసోదరున్
దునిమి నీసహాయాపరునిఁ ద్రుంపక మంచుభి మిన్నకుండెనే?"

ఉ. ఔ నని మంచిప్రశ్నయని యర్కజుఁ డిట్లను "నాలకింపు మో
మానవనాథ! దుందుభి యమానుషవిక్రమవిలసింపఁ డీ
దానవవీరులం దతఁ ధాటికిఁ దాళినమేటి నెచ్చటన్
గానము, భీకరుండు లయకాలున కేనియు నింత యేటికిన్.

గీ. ఆతఁ డనివార్యబలవంతుఁ డాతతాయి
దిగ్విజయమంచు వాఁ డెల్లదేశములను
దిరిగి, హిమవంతునిఁ బెకల్పఁ దివిరినంత
నచ్చటి మునీంద్రుఁ డొకఁ డిట్టు లనియె ననఘ! 105

ఉ. "ఇన్నగముల్ బెకల్చిన సహించుఁడ వౌదువె? చాలుఁజాలు, నీ
యన్నను జంపి యేగినబలాఢ్యుని వాలినిఁ జంపలేక నే
నెన్నఁగరానిమేటి నని యెల్లెడ కేగెదు సిగ్గులేక, పో
మ్మన్న నతండు వాలి నెటులైన వధించెదనంచుఁ జెచ్చెరన్. 106

ఉ. హుమ్మని హుంకరించి యతులోగ్రబలుండవటోయి వాలి! రా
రమ్మనినంత వాలి యదిరా యెద నిప్పుడు చిక్కెనంచు యు
ద్ధమ్మున కేగి వానిభుజదర్ప మణంచి వధించి వాని కా
యమ్మును మీఁదికిన్ విసరినంతన రక్తము తుళ్ళి నెల్లెడన్.

గీ. తనదు నాశ్రమంబునను రక్తంబు బడిన
యంతన మతంగమునివర్యుఁ డాగ్రహించి
వాలి యిచటికి వచ్చెనేని వానిశీర్ష
మాక్షణమ వ్రయ్యలగుఁ గాక యని శపించె. 108

క. మునిశాపము నలుగడలను
వనమున దావాగ్నిభంగి వ్యాపించిన యం
తన విని భీతిలి దేవేం
ద్రునినందనుఁ డీనగమును ద్రొక్కుట మానెన్. 109

గీ. అక్కటంబున నిక్కిండఁ । దక్కి యొండు
స్థలమునకుఁ బోవ నెన్నండు । సాహసింప
వాలిపేర్విన్న నామేను । వణఁకుచుండు
నెట్లు రక్షించెదో నన్ను । నినకులేశ ! 110

గీ. అక్రమముగ నాసర్వస్వ । మాక్రమించె
నంతతోఁ బోక నాభార్య । నపహరించె
నలవుఁగలవానిదే న్యాయ్య । మవనియందు
నన్నుఁ గాపాడదైవ ము । న్నాఁడొ లేఁడొ ?" 111

క. అనిన విని శ్రీరాముఁడు
తనమోమునఁ బిన్నవగవు । తళుకుల నీనన్
ఇనసుతుకరమునఁ గర మిడి
అనఘా యని ధనువుఁ బూని । యనె నిట్లిట్లున్. 112

చ. అతులితవీరసింహుఁ డని । ఖ్యాతినిఁ గాంచినవాఁడు ధర్మప
ద్ధతిని చరింపు టొప్పు, నది । తప్పినవాఁ డధమాధముం డుమా
పతియు విరించియుం డతని । రక్షను నిల్చిన నొక్క కోలన
ప్రతిహతసుప్రతాపబల । వంతుని వాలిని సంహరించెదన్. 113

ఆ. వె. తా సమర్థుఁ డయ్యుఁ । దన మిత్రదుఃఖంబుఁ
దొలఁగఁజేయకుండ । మెలఁగువాఁడు
క్రూరవర్తనుండు । కుటిలుండు కఠినుండు
వానిమోముఁ జూడ । వలదు వలదు. 114

గీ. తనదు దుఃఖంబు తలఁపఁ గొం । డంతయయ్యు
సఖునిదుఃఖంబు పరికింప । స్వల్పమయ్యుఁ
దనదు దుఃఖంబు దిగమ్రింగి । తత్క్షణంబ
ప్రాణమిత్రునిఁ గాపాడు । వాఁడు ఘనుఁడు. 115

చ. అనయముఁ దా నపారవిప।దంబుధిలోన మునింగియున్న నే
జనుఁడు తటస్థభావమున । సఖ్య మొకించుక విస్మరించి మి
త్రుని దురవస్థఁ బాపుటకుఁ । దోడ్పడకుండునొ వాఁడు పాపవ
ర్తనుఁ డగుఁగాక నిక్కముగఁ । బ్రాణసఖుండని నమ్మవచ్చునే?

గీ. దుష్పథంబునఁ దనస్నేహి।తుండు సతము
సంచరించుచు నున్నఁ దత్క్షణమ వాని
సత్పథమునకు మరలింపఁ।జాలువాని
సత్పురుషుఁ డంచు సతతంబు । సన్నుతింతు. 117

చ. సముఖమునందు సంతతము । సఖ్యము ముఖ్యముగా నటించి, ప్రే
మముఁ బ్రకటించి, యిచ్చకపు।మాటల నేరుపుఁ జూపి, నీపరో
క్షమునఁ గలట్టిలోపములఁ । జాటినవాఁడు సఖుండె? కాలస
ర్పమువలె వక్రగామియయి। ప్రాణములన్ గొనుఁగాక మిత్రమా.

గీ. అనయ మన్యోన్య మనురాగ । మాత్మఁగలిగి
అవసర మెఱింగి తోడ్పడు । ననువెఱింగి
హితముఁ జరించువారు స్నే।హితులుగాక
పలుకరించినవా రెల్ల । ప్రాణసఖులె? 118

గీ. త్రికరణంబుఁ బ్రేమించు । రీతిఁజూపి
తనదు నవసర కార్యసా।ధనము కొఱకు
నప్పటికిఁ దియ్యముగఁ బల్కి । యురుకువాఁడు
కుటిలచిత్తుండుగాక స।ఖుండె చెపుమ. 120

గీ. మూర్ఖసేవకుం డతిలోభి । భూవరుండు
కుటిలమిత్రుండు నకవిత్రి।కోమలాంగి
శూలములవంటివా రని । శూరులందు
మెలఁకువన్ గల్గి ప్రాజ్ఞుండు । మెలఁగవలయు. 121

క. తనజనకునకున్ ఘనులగు
మునులకు విద్రోహియైన । పుణ్యజనాధీ
శునిస్నేహముఁ జేసిన ఖలు
ననఘా వినుసంహరింతు । నార్యులు పొగడన్. 122

గీ. వాలి లోకసన్నుతమహా। బలయుతుండు
తనకు లోఁకువయైన యాఁ। దనుజవిభుఁడు
సతులఁబాధించుచుండఁగ । సమ్మతించి
ప్రోత్సహించినగతి మిన్న। కుండఁదగునె? 123

మ. బలవంతుండుండగువాఁడుదుర్బలులకున్। బ్రాపై జగద్ద్రోహులన్
పాలియింపన్ వలెఁగాక యిట్లు ఖలుఁడై । భోగార్థియై ద్రోహికిన్
జెలికాఁడై వరవీరధర్మమును సి। శ్శేషంబుఁగావించునే?
చల మేపారఁగ వాలినేఁ దునిమెదన్। స్థాపించెదన్ ధర్మమున్. 124

చ. అనవుఁడు నవ్వి, యర్కసుతుఁ। డాత్మ నొకించుక ధైర్యమూని, యి
ట్లనియెను, "వాలి భీకరబ। లాఢ్యుఁడు శూలినినైనఁ జీరికిం
గొనఁ డతఁ డట్టివాని నొక। కోలను గూల్చెదనంటి వీవు, నె
మ్మనమున సంశయింతు నను। మానవశంబున జానకీవరా!" 125

గీ. చంద్రమండలాకారస్థ। సప్తతాళ
పంక్తి నొకబాణమునఁ గూల్ప। వలఁతివేని
వాలిని వధింపఁజాలిన। బలుఁడ వగుదు"
వనిన నవ్వుచు శ్రీరాముఁ । డనియె నిట్లు. 126

గీ. "నను బరీక్షింపఁగోరి యి । ట్లనెద వనఘ!
నీదుకోరిక నీడేర్తు । నిక్కువముగ
సప్తతాళవృత్తాంతంబు । సంగ్రహముగఁ
జెప్పు" మనిన నాతం డిట్లు । చెప్పఁదొడఁగె. 127

ఆ. వె. ఒక్కనాఁడు వాలి । యుగ్రాటవిఁజరించి
అఖిలవృక్షవితతి । సరసి యరసి
తాళవనముఁ జొచ్చి । తత్ఫలంబుల నేఱు
సంగ్రహించి కడిగె । సలిలమునను. 128

ఉ. స్నానముఁజేసి వార్చి సద । నంబునకుం జనుదెంచి తానను
ష్ఠానము లెల్లఁదీర్చి, మది । స్థైర్యముగల్పి, జపించి, యీశ్వర
ధ్యాన మొనర్చి, లేచి, వడిఁ । దాళఫలంబుల నారగింప న
వ్వానరనాథుఁ డేగి ప్రతి । బంధకమౌ నొకసర్పముం గనెం. 129

గీ. డంబుమీఁదిశశిమండ । లంబుభాతి
ఫలము లేడింటఁ గూర్చుండి । పడగవిప్పి
దర్ప మేపారసర్పంబు । తాండవించు
వరుసఁబరికించె వానర । ప్రభువరుండు. 130

గీ. అట్లు పరికించి యెంతయు । నాగ్రహించి
"అహికులోత్తమ! నీకుఁ బ్రాణాశ లేదె?
నాఫలంబుల స్పృశియింప । న్యాయ్యమగునె?
విడువఁదగ దింక నిన్ను శ । పింపకుండ. 131

గీ. ఎట్టులుంటివో యట్లుండు । మిప్పు డిచట
నీశరీరంబు విచ్చి, యా । కాశవీథి
ముట్టున ట్లీకు తాళముల్ । బుట్టుఁగాక"
అనుచు శపియించి నెలవున । కాతఁ డరిగె. 132

గీ. అంత వృత్తాంతమంతయు । నాలకించి
ఆగ్రహంబునఁ దక్షకుఁ । డాతనింబ
"ఎవ్వఁ డొకకోల నీతాళ । వృక్షములను
గూల్చునో వాఁచే వాలి । కూలుఁగాక" 133

గీ. అనుచు శపియించె వెండియు । నలసుతంగుఁ
"దైవము దుందుభి కాయంబు । నేకమాత్ర
బాణమునఁ జిమ్మె వానికిఁ । బ్రాణములను
వాలి యుర్పించు" ననిపల్కెఁ । బ్రాణసఖుఁడ! 134

గీ. అనఘ! యఖిలవృత్తాంత మాద్యంతముగను
విన్నవించితి, నాజ్ఞకై । వేచియుంటి
జంకవలదని యభయము నొసఁగి తీవ్ర
కరుణతో నన్నుఁ గాపాడఁ । గలవా దేవా? 135

గీ. అనినవిని భావగర్భిత । మైన మంద
హాస మాస్యమండలమున । కంద మొసఁగ
నర్కసుతుఁ జూచి తలయూచి । యాక్షణంబ
ఒక్కయాఁకునఁ దనదు వ్రేలెక్కువెట్టి. 136

గీ. ఏకబాణంబునన్ తాళవృక్షపంక్తి
నేలకుంగూల్చి, యవలీలఁ । గాలివ్రేల
దనుజకాయంబు మిన్నందు । కొనఁగ మెచ్చె
హనుమ వినుతింప సుగ్రీవుఁ । డౌ ననంగ. 137

గీ. శాపము విముక్తిఁ జెందంగ । సర్వరాజ
మఖిలగుణధాము శ్రీరాము । నభినుతించి
అర్కసుతుఁ గాంచి మేలగు । ననివచించి
నాకలోకంబునకు నేగె । వేగమునను. 138

ఉ. "నాయనుమాన మిప్పుడు మనంబున నంతయు నంతరించె; నే
మోయనుకొంటి, నీమహిమముల్ గొనియాడఁగ నాకు శక్యమే?
నీయసమానబాణము త్రినేత్రునినైన జయించు, వాలికిన్
ఆయువుమూఁడె నింక సకలాసురకోటికిఁ జావు చేకురెన్. 139

గీ. విశ్వసంభవ! విశ్వాత్మ । విశ్వనాథ!
విశ్వసించితి నీ వాది।విష్ణు వనుచు
మానవులయందు లేని నీ।మహిమ, మహిమ
హాత్ములకేని పరికింప । నద్భుతంబు. 140

ఉ. వీరుల మంచు గర్వమున । విశ్రుతధర్మముఁ దప్పి, ధీరులై
క్రూరతసంచరించు రిపు।కోటికి నీదు నమోఘచాపటం
కారము, ధర్మరాణ్మహిమ।కంఠఘళంఘళకాంస్యకింకిణీ
ఘోరరవంబయం చిపుడు । గొంతగ్రహించితి సంతసించితిన్. 141

ఉ. పారములేని ఘోరభవ।సాగరపంకమునందుఁ జిక్కి, సం
సారము సారవంతమని । చాలభ్రమించితి; నాదరించి యే
తీరున నన్నుఁ బ్రోచెదవొ ?।దీనుఁడ వెఱడియు జ్ఞానహీనుఁడన్
శ్రీరఘురామ ! నీదు పద।సేవకు నర్హుఁడనైన ధన్యుఁడన్. 142

గీ. పతితపావన ! సద్భక్తి । వలయుఁ గాక
నాకు సామ్రాజ్యపట్టాభి।షేక మేల ?
మహి నపారదుర్వారసం।సార ఘోర
జలధికిన్ నావ నీపాద।జలజసేవ. 143

గీ. మంచిచెడ్డలు పరమార్థ।మార్గమునను
పాడము వెన్నండు సంసార।మునను దక్క ;
అఖిలముఁ ద్యజించి, యనఘ! ని।న్నాశ్రయించి,
ఎలమి మోక్షంబుఁ గొందు నా । కేల కుందు ? 144

గీ. శత్రువన నెవ్వఁ డూహింప । మిత్త్రుఁ డెవఁడు ?
తలఁప నీకుమాయాకల్పి।తంబు గాక ;
వాలి నిక్కంబుగా నాకుఁ । బరమహితుఁడు
వాని చేఁ గాదె నినుఁ జూచు।భాగ్యమబ్బె. 145

గీ. సంసరణసంగముఁ ద్యజించి । సంతతంబు
నీదుచరణంబులను నమ్మి । నిను భజింతు
భండనం బేల నొకనితో । వైర మేల?
లోక మేల సామ్రాజ్యాభి। షేక మేల? 146

ఉ. వాలినిఁ జంపవ ద్దతఁడు । బల్మినిఁ బట్టినకాంతవ ద్దతం
డేలిననేలవద్దు, వచి।యించెదఁ గ్రోధమె వైరి, శ్రద్ధయే
నాలలితాంగి, నీనుభజ।నంబె సుఖప్రద రాజ్యలక్ష్మి; యిం
కేల విచారభారము వ।హింపఁగఁ గార్యము నిర్వహింపఁగన్. 147

మ. అరిషడ్వర్గము సంహరించుటకు దేవా! దైవసంసేవ చే
కురిన్ జాలదె, నీదు దర్శనమునన్ । క్రోధాగ్ని చల్లారె, దు
ర్భరసంసారపయోధిని స్తరణమా।ర్గంబొందు గన్పట్టె నీ
కరుణన్ నీపదసేవచేఁ బడసెదన్ । గైవల్యకల్యాణమున్. 148

గీ. తనమహత్త్వ మెఱింగి త।త్త్వజ్ఞుఁడైన
అర్కసుతుఁజూచి శ్రీరాముఁ । డనియె నిట్లు
"ఐహికసుఖంబు లన్నియు । ననుభవించి
పిదపఁ గైవల్యపదవికి । వెడలవలయు. 149

చ. అనఘ! ప్రతిజ్ఞఁ బల్కితిని । యయ్యది యెన్నటికేని నిష్ప్రయో
జనముని గోఁదలంపకుము, । సత్యముఁ దప్పి వచించువాఁడనే?
ఘనమగు రాజ్యవైభవముఁ । గాంచెద విచ్చట, నాపయిన్ పున
ర్జననముఁ దక్కి మోక్షమను। శాశ్వతసౌఖ్యముఁ బొందెద చ్చటన్

ఉ. రమ్మని వాలిఁ బిల్చి సమ।రమ్మున నిల్చి పెనంగు మించుకేన్
నెమ్మది భీతిఁ జెందకుము, । నీకు జయమ్మగు నిక్కువంబుగన్
బొమ్మని నంత భాస్కరసు।పుత్త్రుఁడు ద్వారముచెంత కేగి ధై
ర్యమ్మున బొబ్బరించి కపి।రాజును డీకొనిపిల్చె నాజికిన్. 151

గీ. శయనగృహమునఁ దనపద్మ । నయనతోడ
సరససల్లాపములఁ దేలు । సమయమునను
వాలి సుగ్రీవుహుంకార । మాలకించి
ఉల్లము చలింప నింతక । తల్లడిల్లి. 152

శా. "ఓ నాథ! ఏమియపూర్వసాహసము, సిం । హద్వారముం జొచ్చి దో
న్నాదంబున్ బ్రకటించు డీతఁడు తిర । స్కారంబుగాఁ బిల్చె, నా
పే రాలించిన యంతమాత్రముననే । భీతిల్లు సుగ్రీవుఁ డీ
తీరన్ గైకొనవచ్చెనో? యెవఁడు ప్రో । త్సాహించెనూహింపఁగన్

క. సాటియగు మేటికైవడిఁ
బోటరియై వచ్చె వీనిఁ । బోకార్చెద నే
పాటిబలుఁడో చూచెద నన్
బాటింపక వీని కెవఁడు । ప్రాపుగ నిలుచున్? 154

గీ. అఱచు మదినెంచి లంఘించి । యాముగఱచి
మల్లడించుకిన్కనఱచి । మల్ల చఱచి
ధ్వజముఁ బోలిన యుత్తాల । వాల మెత్తి
ప్రజ్వలజ్జ్వాలియై వాలి । వాలినంత. 155

గీ. "అంగదా! రమ్మ ర । "మ్మని యార్తితోడఁ
దార యెదురేగి వాలిపా । దముల వ్రాలి
"ఆత్మనించుక శాంతింపుఁ । " డనివచించి
ఇట్టులని యెను తనప్రేమ । మట్టివడఁగ. 156

చ. "మగువలు బుద్ధిహీనలని । బుద్ధిఁ దలంపక యాలకింపుఁడీ
తగినబలంబులేక తఁడు । తారొక్కను తెంపరియే? నగంబునం
దగఁబడి రాఘవుం డభయ । హస్త మొసంగినయట్లు వింటి మో
యగచరనాథ! రాముఁడు మ । హామహిమాఢ్యుఁడు మర్త్యమాత్రుఁడే.

ఉ. ఇంతకుఁ బూర్వ మెన్నఁడు మహీంధరముం దిగిరాని వాఁడు, నీ
పొంతకు వచ్చి డీ యనునె మూఢుఁడ? బాసటయై దిగంతవి
శ్రాంతయశోధ్వజుండు రఘురాముఁడు వెంబడి రాఁగ యున్న; నా
మంతన మాలకించి నిలుమా నిరపాయముగన్ సుఖింపుమా.

ఉ. తాటకఁ జంపె బాల్యమున దాశరథిన్ వినుతింప శక్యమే?
హాటకగర్భుచే వరము లందిన దైత్యుల నుక్కడించు మేల్
పోటరియౌచు వీరులగు భూవరులున్ వినుతింప, నీజగ
న్నాటకసూత్రధారి యని జ్ఞానులు చెప్పఁగ నాలకింపమే? 159

గీ. సాత్త్వికగుణాభిరాముఁడు సమరభీముఁ
డర్కకులవారినిధిసోముఁ డఘవిరాముఁ
డార్యనుతసద్గుణస్తోముఁ డమృతధాముఁ
డతని నెదిరింపవశమె బ్రహ్మాదులకును. 160

సీ. పూర్వప్రాయమునందుఁ బాపాత్ములవధించి
ఱాఁతి నాతిగఁ జేసి ఖ్యాతిఁ గాంచె
శివచాపముం ద్రుంచి సీతను పెండ్లాడి
పరశురాముని బాహుబలమణంచె
సకలసామ్రాజ్యంబు సవతితల్లి కొసంగి
యోగియై యడవుల కేగుదెంచె
ఖరదూషణాదిరాక్షససైన్యముం గూల్చి
మనుజలోకాతీతమహిమఁ జూపె

తే. గీ. ఆదినారాయణుఁడు రాముఁ డనుచు మునులు
సకల దిగ్దేశములయందుఁ జాటుచుండ
వినియు, నొకనాడు నతని సేవింపకుంటి
వింతకంటెను దుష్కార్య మెందుఁ గలదె? 161

గీ. కవులవాక్కు, మహాత్ముల । కార్యదీక్ష
బ్రాహ్మణద్వేష మీశ్వరు । పాశుపతము
సాధుజనహింస శ్రీరామ । చంద్రశరము
భక్తవరులసంకల్పంబు । వ్యర్థమగునె?" 162

గీ. అనినవిని వాలి దరహాస । మంకురింప
"నోసి భీరువ! నీ కింత । గాసియేల?
రామచంద్రుండు త్రిభువనా । రాధ్యుఁడైన
దైవమేయైన భీతిల్ల । దగునె మనకు. 163

గీ. అనఘుఁ డగు రాముఁ డఖిలలో । కైకవీరుఁ
డనఁగఁ బ్రఖ్యాతినార్జించె । నంబుజాక్షి!
అతని గెలిచితినేని స । ద్యశముఁ గొందుఁ
జావు చేకూరెనేని మో । క్షంబుఁ గొందు.

చ. అతఁడు మహానుభావుఁ డని । యందురు మర్త్యుఁడో లేక దేవుఁడో?
అతివ యెఱుంగరాదు, మను । జాకృతిఁ దాలిచి దేవుడిట్టు లీ
క్షితిని జనించి నాతని వ । చించినఁ జెల్లదు, నిక్కమెట్టిదే
సతతము ధర్మమున్ నిలుపఁ । జాలు మహాత్ముఁడె దేవుఁడిద్ధ్రువిన్.

గీ. మగువ సమదర్శి రాముండు । తగవుఁదప్పి
వ్యవహరించునె సుగ్రీవుఁ । డాపుఁ డనుచు
అతఁ డెంతటివాఁడైన । నగును గాక
జంకునే యోధసింహుండు । సమరమునకు. 166

గీ. తన్నుమించిన బలశాలి । ధరణినున్న
యోధసింహుండు వైరింప । నోవఁ డెపుడు
నిక్కముగ రాముఁడో నేనో । నిలువవలయు
నిరువురకు నిండు దావు లే । దిందువదన!" 167

చ. అని యొక్కుమ్మడి హుంకరించి తన సింహద్వారముఁ దాటి ర
మ్మని సుగ్రీవుని దాకి యేపుమెయిఁ గేలందించి లంఘించి నం
తనె సుగ్రీవుఁడు నిల్చి కొంతదనుకన్ ధైర్యంబునన్ బోరె మే
లని శ్రీరాముఁడు లక్ష్మణుండుఁ దనబాహాశక్తి నగ్గించఁగన్.

ఉ. అంతట వాలి నేత్రముల నగ్నికణంబులు రాలఁ జూచి కా
లాంతకుభంగి మండిపడి యారఘురాముఁడు లక్ష్మణుండు వి
భ్రాంతినిబొందఁగా నశనిపాతము పైఁబడినట్లు గుద్దె భా
స్వంతతనూజుఁ దేపుచెడి బళ్లున రక్తముఁ గ్రక్కి పర్విడన్.

గీ. వాలి వడి వెంబడించిన వగిదిఁ దోఁపఁ
జెమ్మటలు మేనఁ గ్రమ్మఁగ సొమ్మసిల్లి
వచ్చి రక్షింపు మోరామభద్ర యనుచు
నినసుతుఁడు రామునిం జేరి యిట్టులనియె. 170

గీ. వాలి చెలరేగి వక్షంబు వగులఁబొడిచె
నొక్క గుద్దునకున్ నల్లఁ గ్రిక్కుకొంటి
నన్నుఁ గాపాడఁజాలక మిన్నకుంటి
ధర్మమా చెప్పుమా పరంధామ! రామ! 171

మాలిని. శరణుశరణు రామా! సచ్చిదానందధామా!
సురనుత రణభీమా! సూర్యవంశాబ్ధిసోమా!
కరుణగలిగి నన్నున్ గావు మావన్న నిన్నున్
గిరితటమునఁ గంటిన్ నెమ్మదిన్ నమ్మికొంటిన్.

చ. అన విని రాఘవుండు కరుణాభరణుండు వచించె నీగతిన్
కనుఁగొన వాలి నీవు నొకరైకపడిఁ దోఁచిన కారణంబునన్
మనమున సంశయించితివి మార్గణ మెవ్వనిపైఁ ద్యజింపనా
నని, విను మంతె కాని సఖుఁడా! కపటంబున మిన్నకుంటినే? 173

ఉ. ఇంకవిచారమేల? వడి । నిప్పుడ యేగుము పుష్పమాలికా
లంకృతకంధరుండవయి । లావరివై చెలరేగు మేపుకై
బింకముఁజూపి వాలి మది । భీతిలఁ బోరు నొకించు కంతవేఁగా
జంకకు మేను భూరుహము । చాటున నిల్చెద వాలిఁ గూల్చెదన్.

గీ. అనినవిని మేలుమేలని । యర్కసుతుఁడు
వెడలి వాలి నాహ్వానించి । భీతిఁదక్కి
తనకు బలమున్నదనుకను । వెసఁగులాడి
బలము క్షీణింప శ్రీరాముఁ । దలఁచె మదిని. 175

గీ. తన్ను ధ్యానించుభక్తుని । తలఁ పెఱింగి
సమయ మిదియంచుఁ దనశరా।సనముఁబూని
అమరులెల్లరు మే లని । యభినుతింప
నొక్కబాణంబునన్ వాలి । నుక్కణంచె. 176

గీ. జివ్వుమని రాముబాణంబు । హృదయవీధి
బ్రద్దలగునట్లు వెడలంగ । వాలి తూలి
నేలకున్ గూలి, హృదయశో।ణితమునందుఁ
బొరలుచున్ జూచె శ్రీరాముఁ । బుణ్యకాముఁ. 177

గీ. రామచంద్రునిదివ్యవ।ర్చస్సుఁగాంచి
మాధవుఁడొ లేక యాతఁడు । మాధవుండొ
మైననగుఁగాక యీరీతి । నాచరింప
నర్హమేయని గర్హించి । యనియె నిట్లు. 178

గీ. "చెట్టుచాటునదాఁగి ల।క్షించి నన్ను
విగతజీవునిఁ జేయుట । మగతనంబె
శూరుఁడవె చోరుఁడవొ నన్ను । జూడలేక
దాఁగి పొడిచితి విది వీర।ధర్మమగునె? 179

గీ. నీవు తేజస్వి వగుదువు । నిక్కువముగ
విమలుఁడవు దివ్యమంగళ । విగ్రహుఁడవు
అక్రమంబుగ నిట్టికా । ర్యం బొనర్పఁ
బాల్పడితి వక్కటా! నీకుఁ । బాడియగునె? 180

గీ. తెక్కలివిధంబునన్ నాకుఁ । దెలియకుండఁ
బొంచి పొడిచితి వపకీర్తిఁ । బొంది తీవు
అనఘ! సుగ్రీవుఁ డేపాటి? । యల్పబలుఁడు ;
వాని స్నేహంబువలన లా । భంబుగలదె? 181

గీ. నీకు శాత్రవుండనె? వాఁడు । స్నేహితుండె?
ఇట్లు వధియింప నవసరం । బేలకలిగె?
వేఁటరివిధానఁ బోకార్చి । పోటరి నని
ఆత్మ నప్పొంగుచుంటి వ । హంకరించి. 182

గీ. ఈవు సమదర్శివేని, నీ । కిట్టిసేఁత
తగదు, మాయిర్వురంగల । తగ వెఱింగి
మెలఁగవలెఁగాక, నాతప్పుఁ । దెలుపకుండ
నన్ను వధియించినాఁడ వ । న్యాయ్యముగను. 183

గీ. నాదుపేర్విన్న దానవ । నాయకుండు
గడగడవడంకి కాళ్ళపైఁ । బడునుగాదె
అకట! నాతోడఁ జెప్పిన । నతివఁ దెచ్చి
నీకు నర్పించియుందును । నిక్కువముగ. 184

గీ. ధర్మసంస్థాపనార్థంబు । ధరణియందు
నాదినారాయణుం డిట్టు । లవతరించె
ననుచు మునిపుంగవులు నిన్ను । నభినుతింతు
రనఘ! యామాట నిక్కువం । బగునె చెపుమ." 185

గీ. అనిన విని నవ్వి హనుమంతుఁ డనియె నిట్లు
"అనఘ! మునిపుంగవుల వాక్య మమృతమగు నే?
నిక్కమెట్టిదేఁ, ధర్మంబు నిలుపునట్టి
నృపతు లసియైన నీ వాదరింపవైతి. 186

గీ. అనఘ! సంశయాత్మా వినశ్యతియనంగ
వాలకింపవొ? యది యెట్లు వ్యర్థమగును?
తాఁడఁ దన్నినవారి యాదలలఁదన్ను
బల్లిదులు లేకయుందురె వసుధయందు.

చ. పొరబడితీవు నీదు బలముం గని భీతిలి రామభద్రుఁ డీ
ధరణిసుహంబుపొంతఁ దలఁదాఁచుకొనన్ దలపెట్టెనొక్కొ? త
త్సురుచిరదివ్యవిగ్రహముఁ జూచి పరాత్పరుఁ డంచుఁ గాళ్లపై
శరణని వ్రాలెదేమొ యనుఁజాకున నిల్చెఁ గుజంబు చాటునన్.

గీ. నిను వధింపక విడిచినఁ దనప్రతిజ్ఞ
వ్యర్థమగుఁగాదె, వంశ మర్యాదఁబట్టి
తొలుతటిప్రతిజ్ఞ విడనాడి తొలఁగవలెనొ?
శరణు జొచ్చినవానినిఁ జంపవలెనొ?" 189

గీ. అంత శ్రీరాముఁ డవ్వాలిపొంత నిలిచి
వానరోత్తమ! నేను నీ ప్రశ్నములకుఁ
దగినప్రత్యుత్తరము లీయఁదగునుగాదె?
వాదుపలుకుల సావధానముగ వినుము. 190

ఆ. వె. "మంత్రిమహితమైన మాయామణిధరించి,
అతులబలుల తేజ మపహరించి,
అక్రమముగ మెలఁగు టది నీకు ధర్మమేఁ,
ఎట్టులేని నిను జయింపవచ్చు. 191

చ. అమరవిభుప్రదత్తమణి । నక్కునఁదాల్చి, మొనర్చువారి స
త్వ మపహరించి గెల్చుటది । ధర్మమె? యమ్మణిఁ బాసి యుద్ధరం
గమునను నిల్వఁజాలిన ము।ఖాముఖ నీమనహోదరుం డె న
క్రియముగ నిన్నుఁ జంపి సతిఁ । గైకొనుఁ బోయనహాయశూరుఁడై.

గీ. ఏను దేవుండనో లేక । మానవుఁడనొ?
నే నిరూపింపఁదగ దద్ది । నిష్ఫలంబు
అవనిఁగలసర్వజీవుల।యాత్మలందు
అతఁడు గలఁడంచునమ్మిన । హానిగలదె? 193

గీ. ధర్మ మెటనుండు నచ్చోట । దైవముండు
ధర్మపరుఁడను వాయందు । దైవముండు
దైవకార్యంబు ధర్మసం।స్థాపనంబు
ఏ నెవండను భగవంతుఁ । డెవఁడు చెపుము. 194

గీ. అఖిలజీవులుఁ దా నని । యాత్మఁదలఁచి
ధరణి ధర్మంబుఁ దప్పిన।తరుణమునను
ధర్మముఁ గా నిల్ప రక్తంబు । ధారవోయు
ధన్యుఁడే దైవ మనియందు।రు తత్త్వవిదులు. 195

ఉ. ని న్నెదిరించి యుద్ధమున । నిల్చి వధింపఁగ సర్వశక్తిసం
పన్నుఁ డనంతుఁడైన భగ।వంతుఁడు కావలె నొక్కొ? దేవుఁడే
నిన్ను వధింపఁజాలునని । నెమ్మదినమ్మితి వేని, వీరలో
కోన్నత! యొక్కబాణమున । కోవక యీగతిఁ గూలవచ్చునే? 196

గీ. ఏను దేవుండనైన న।న్నెలమిఁగొల్చి
ఈప్సితంబులఁ బడయుంగ । నెంచినావొ?
మానవుఁడనైన ననుఁజంపి । మామకీన
ధనముఁ దరుణిని హరియింపఁ । దలఁచినావొ? 197

చ. అనుజుని భార్య చెల్లెలని యార్యులు పల్కఁగ నాలకించియున్
మనమున సంశయింపక, యమానుష మంచుఁ దలంపకుండ, ద
మ్మునిని నిరసించియున్ దనివిఁ బొందక, తత్సహధర్మచారిణిన్
జన మొగి సేవగింప వ్యభిచారిణిఁ జేసితి వక్రిమంబుగన్. 198

గీ. అనుజభార్యయుఁ జెల్లెలు తనుజునతియు
తనుజయు సమానులని యార్యులనఁగ వినియుఁ
బాపదృష్టినిఁ బరికించు వానికంటెఁ
బాపియుండునె చెప్పుమా వానరేశ. 199

గీ. తలఁప నీకంటె రావణుం డలఘుఁ డగును
అతఁడు పరకాంతలను మాత్ర మపహరించుఁ
గోరి తమ్ముని భార్యఁ గైకొంటి వీవు
నిను వధింపక వానినేఁ దునుమఁ దగునె? 200

గీ. ఈవు బలవంతుఁడవు, దానవేశ్వరుండు
నీకు లోఁకువ, యాతండు నీతిఁ దప్పి
సంచరింపంగ నంగీకరించినట్లు
మిన్నకుంటివి నీకంటె మిన్నయగుట. 201

గీ. "వలువఁ గొనెనంచు నాతోడఁ జెప్పియున్న
నసురవిభుఁ బట్టి తెచ్చెద" నంటి వీవు
అనుజునిల్లాలి బలిమిమైఁ గొనినపాపి
నెట్లు నినుఁ జూడవచ్చు నో యింద్రతనయ! 202

గీ. ఇంద్రసుతు నాత్మజుఁడ వాతఁ డిచ్చినట్టి
మణిని ధరించి శత్రుల మదమణంచి
తతని సాధించి బాధించు నసురవిభునిఁ
జక్కఁజేయక యెట్లుంటి వక్కటకట! 203

గీ. అన్యకాంతల, విత్తంబు । నపహరించి
బాహుబలగర్వమున ధర్మ।పథముఁ దప్పి
సంచరించినక్రూరులఁ । జంపు టద్ది
సహజ మగుధర్మ ముత్తమ।క్షత్రియులకు. 204

గీ. రాజ్యమున నేమి? యయ్యది । ప్రజలసొత్తు
"నలుమవలెవన్నఁ గోరి కి।ష్కింధనుగను
ప్రజలు సుగ్రీవునకు రాజ।పదవి నొసఁగి
రతని నిర్వాసితునిఁ జేసి । తక్రమముగ. 205

గీ. వీరభోజ్యంబు రాజ్యంబు । వీరవరుని
దక్షభూమండలం బని। శ్రుతి చరించు
క్రూరులవధించి ధర్మంబుఁ । బ్రోచుకొఱకు
నప్పు డప్పుడు జన్మింతు । నవనియందు." 206

గీ. అనిన విని వాలి యిట్లను । "నసురపతియు
నేను నేకీభవించిన । హానియుండు
ననుచుఁ దొలుత నన్ జంపితి । వైననేమి?
నిన్నుఁ గనినంతఁ జింతల।న్నియు నశించె. 207

గీ. సౌఖ్యములఁ బొందఁగోరి దో।షములఁగొన్ని
నే నొనర్చితి నందు సం।దియము లేదు
జరిగినయుదంతమున కింకఁ । జర్చ యేల?
చాలు, నాకు నిప్పుడు మన।శ్శాంతి గలిగె. 208

గీ. అనఘ! నీవన్నయట్లు నా।యందు గొప్ప
తప్పు లున్నవి యిప్పు డే।నొప్పుకొంటి
నాయహంకార మంతయు । నాశమయ్యెఁ
బావనుఁడనైతి నినుఁజూచి । పంకజాక్ష! 209

గీ. మానవాకృతినున్న నీ। యానన మను
దర్పణంబున దైవంబు । తథ్యముగను
నాకుఁ బ్రతిబింబ మట్లు గ। న్పట్టుచుండె
దివ్యపురుషుండ వౌదు సం। దియము లేదు. 210

గీ. అంత్యకాలంబునందుఁ నీ। యాకృతిఁ గని
పావనుఁడనైతి నాకింకఁ । బాపమున్నె?
అనఘ! నీచేతఁ జచ్చితి। ననుచుఁ గుందఁ
బడయ లేకుంటి నీదివ్య। పాదసేవ. 211

గీ. ధర్మసంస్థాపనార్థంబు । ధరణియందు
నవతరించితి వికఁ సంశ। యంబు లేదు;
కాకయున్న మహాత్ముఁ డ। కారణముగ
జన్మమొందునె సంసార। సౌఖ్యములకు. 212

గీ. నీదు బాణం బమోఘంబు । నాదుహృదయ
దురభిమానంబు ఛేదించె । సరసిజాక్ష!
నీవు దివ్యుండవు త్రిలో। కపావనుఁడవు
తెలిసె నాయంతరాత్మ బో। ధించె నిపుడు. 213

గీ. ఉర్విఁ గల జీవులకు సౌఖ్య। ముప్పతిల్లఁ
గోరి యేగుదెంచిన జగ। ద్గురుఁడ వీవు
పామరుండను సైరింప। వలయు దేవ!
తండ్రి బిడ్డలకుం దేని। తగవు గలదె?" 214

చ. అన విని రామచంద్రుఁ డభ। యప్రదహస్తము వాలిశీర్షమం
దున నిడి నవ్వుచున్ బలికె । దోషము నీయెడ నంతరించె ను
ర్విని చిరకాలముండఁ దల। పెట్టిన దేహముతోడ లోకమం
దున నిలుమా జరామరణ। దుఃఖముఁ బాపెద వానరోత్తమా! 215

గీ. అనిన విని వాలి శ్రీరాము నభినుతించి
హస్తయుగమును మోడ్చి యిట్లనియె నెలమి
నంత్యకాలంబునందు నీయాకృతిఁగని
పరమున్ గంటి నఖిలపాపముల గెంటి. 116

గీ. జపతపంబుల శుష్కించి సన్నుతించు
మునుల కేని గన్పట్టని పుణ్యమూర్తి
అహహా ! నాపుణ్య మేమొ ప్రత్యక్షమయ్యె
ననఘ ! శ్రీరామభద్ర ! దయాసముద్ర! 217

గీ. నిన్నుఁ దనివోవ వీక్షించి సన్నుతించి
ఎలమి నీదు నామాక్షరంబులఁ బఠించి
ప్రాణములఁ బాయుకంటెను భాగ్యమున్నె
ఇట్టితరుణంబు తిరుగ నా కెప్పు డబ్బు. 218

గీ. స్వచ్ఛమగు మోక్షముఁ ద్యజించి తుచ్ఛమైన
ఐహికంబును వాంఛించు నజ్ఞుఁ డెవఁడు?
ఎవని వేదంబులున్ నుతియింపఁజాల
వట్టి నినుఁ గంటి మోక్షరాజ్యంబుఁ గొంటి. 219

గీ. నియతిమై నింద్రియంబుల నిగ్రహించి
ప్రాణవాయువు షట్చక్రపథమునందు
నక్రమంబుగఁ బోనిచ్చి సంతతంబు
మౌనివరులు సహస్రారమధ్యమునను
ఎవని దర్శింతు రట్టి నిన్నిపుడు గంటి. 220

గీ. కామధేనువు దర్శించు ఘనుఁ డెవండు
చల్ల యాచించి యంతతో సంతసించు
నాదినారాయణుఁడవు నిన్నాశ్రయించు
ననఘుఁ డైహికంబులఁ గోరి వ్యర్థుఁడగునె? 221

గీ. అనఘ! రఘునేత! పాపప్రయాణవేళ
నీదు నామంబు జ్ఞప్తికి రాదు చూవె
నిక్కముగ నెంత ఘనుఁడనో నిన్నుఁ గాంచి
ధ్యానముం జేసి తరియింపఁ దయిన మొదవె. 222

ఉ. *ఏను వరించు కామితము లీవు సమర్థుఁడ వీవు, నాదుక
ర్మానుగతిన్ చరాచరసమన్వితమైన జగంబునందు నే
యోనులయందుఁ బుట్టిన, భవోదధినుండి తరింపఁ జేయు నీ
ధ్యానము నాకొసంగవలె ధర్మవిచక్షణ! యంబుజేక్షణా! 223

శా. నాకోర్కుల్ ఫలియించె నిన్నుఁ గనుటన్; నావంశమున్ నిల్పఁగా
నాకొక్కండు తనూజుఁ డంగదుఁడు, ప్రజ్ఞావంతుఁడై లోకసు
శ్లోకుండై, భవదీయదివ్యపదదాసుండై భవత్సత్కృపా
సాకల్యంబున కర్హుఁడై మెలఁగినన్ శాంతించెదన్ రాఘవా!

ఉ. ఖండనపాండితీపటిమ భాసిలు వీరుల నెట్టివారి నొ
క్కండ జయింపఁజాలిన యఖండబలాఢ్యుఁడు నాతనూజుఁ డు
ద్దండుఁడు, నీదు పావనపదద్వయిఁ గొల్చుచు సంతతంబు నీ
యండనయుండు వీనిఁ గొను మాశ్రితచందన! రాజనందనా! 225

గీ. "ఆదరింపుము నాపుత్త్రు నభయ మొసఁగి"
అనుచు నంగదు రాముని కప్పగించి
ధీరుఁడై నిశ్చలుండయి దృష్టి నిల్పి
భక్తిమెయి మ్రొక్కి యీరీతిఁ బ్రస్తుతించె. 226

సీ. కామమోహాద్యుగ్రగాఢాంధకారార్క
కిరణముల్ శ్రీరామకీర్తనములు

* అనన్యభక్తివలనఁ గాని కర్మములు నశింపవు. కర్మములు నశించిన గాని జన్మరాహిత్యము కుదురదు. బ్రహ్మవిద్యాభ్యాసము లేని వాలి యిట్లు కోరుటచే నతనికిఁ జాలకాలము దనుక మోక్షము లభింపకపోయెనని తత్త్వజ్ఞుల యభిప్రాయము.

బహుజన్మసంచిత।భయదకిల్బిషపంక
గ్రీష్మముల్ శ్రీరామ।కీర్తనములు
భవఘోరకానన।ప్రజ్వలద్దావాగ్ని
కీలలు శ్రీరామ।కీర్తనములు
మునిజనవాంఛిత।మోక్షలక్ష్మీదివ్య
గేహముల్ శ్రీరామ।కీర్తనములు

గీ. భక్తవరదంబు లాశ్రిత।వత్సలములు
అఖిలశుభదంబు లార్తజ।నావనములు
పుణ్యఫలదంబు లవతార।పురుషసత్ప్ర
వర్తనంబులు శ్రీరామ।కీర్తనములు." 227

తే. అట్లు వినుతించి నవ్వుచు । నాక్షణంబు
ప్రాణములఁబాసె నతఁడు ని।ర్లక్ష్యముగను
కంఠగతపుష్పహారంబు । గళితమయ్యె
నరకుసేయనిభద్ర।గజంబు మాడ్కి. 228

తే. అంబుజాక్షునికరుణాక।టాక్షమునను
వాలి సంతసించుచుఁ బోయె । స్వర్గమునకు
పంపఁగలపౌరు లెల్లరు । వాలిఁదలఁచి
అధికముగ నేడ్చి రవ్వార్త । నాలకించి. 229

తే. నడుము తడఁబడఁ గేశబం।ధంబు వీడ
వలుఁదగుబ్బలపైఁ గల।పైటజాఱ
కాలువలు గట్టి కన్నీరు । జాలువాఱ
నచ్చటికి వచ్చెఁ దార దై।న్యావతార. 230

తే. వచ్చి నిశ్చేష్టయై నిల్చి । వాలిఁ బిల్చి
కోరుమని యేడ్చి శ్రీరాము।మోముఁ జూచి

"అకట !" యని వాలిశిర మొద। వదిమినొక్కి
వెక్కెభంగుల విలపించె । వెక్కి వెక్కి. 231

సీ. "సౌందర్యలక్ష్మికి । సదనంబుఁబోలిన
వదనమా యిది జిత। పంచబాణ !
వలపించి యెలమి న। న్నలరింపఁ జేసిన
యీక్షణంబులె యివ్వి । యిందిరతనయ !
వఖ్యాతి కెక్కిన । బలులను గెలిచిన
బాహువులే యివ్వి । మోహనాంగ !
ఆలింగనంబున । కానందదంబైన
వక్షమే యియ్యది । ప్రాణనాథ!

గీ. అప్రతిహతప్రతాప మా। ర్తాండతేజ
మర్కటర్కట ! నేటికి । నస్తమించె
నార్యవరుఁడయ్యె సీతమ్ముఁ। డన్నయనెడు
కూరిమిం బాసె రాముండు । కొంకదీసె. 232

మ. వలదంటిన్ బ్రతిమాలుకొంటి, ననుజున్। బాధించినన్ నీవు త
త్ఫలమున్ బొందెదవంటి, ధర్మమును సం। స్థాపింప జన్మించెఁ గే
వలమర్త్యుండె రఘూద్వహుండు వినుమా । వైరంబు వద్దంటి, నా
పలు కాలింపక తెచ్చుకొంటివి మృతిన్ । ప్రారబ్ధకర్మంబునన్. 233

చ. అలిగితివేమి? యంగదుని। యంగదఁ బాపఁగఁజూడవేమి నేఁ
బిలచినఁ బల్కవేమి? యల। వేలుపుసానుల నిచ్చగించి మ
మ్మలవిడనాడితో యకట। పొక్కుచు వెక్కుచునున్నదాన నన్
దలఁకవొ? కామినీహృదయ। తస్కర! వానరవంశభాస్కరా !

క. వాలీ ! రణకేళీజిత
శూలీ ! వీరాలివంశ। శుష్కారణ్యా

వాలీ! రాముంగని వన
మాలీ! యని శౌర్యబడిన మరణంబున్నే? 235

గీ. అకట! నీపుత్త్రినొక్కని వధుఁజేసె
నిన్ను డీఁకొక్కసుతుఁ జంపెఁ గృపఁదొరంగి;
ఏసుతున కింక నాప్తుఁడై యొసఁగుననుచు
మాధవుంగొల్చెదో సురనాథ! చెపుమ. 336

మ. అని యిట్లేడ్చుచు నెత్తిమొత్తుకొనుచు న్యబ్జాక్షి వీక్షించి యా
వ్వనజాత్ముఁడు చెంతకేగి కరుణాపాథోధియై యిట్లనెన్
"వనితారత్నమ! మేను శాశ్వతమె? విభ్రాంతిన్ మనస్తాపముం
గొనినన్ లాభము లేదు చూవె, యిటు లాక్రోశింప నీకేటికిన్.

సీ. ఎవఁడు నిను మున్ను పెండ్లాడి యింతదనుక
నఖిలకష్టంబులకు నోర్చి నట్టివాఁడు
భానుసుతుఁ డుండఁ జచ్చెఁ వానికొఱకు
నింత యేడ్చెద వబల! నిన్నమనందు? 238

గీ. నిల్చునది యాత్మ, దేహ మనిత్యమగుటఁ
బంచభూతాత్మకంబై పాడు మేను
ఎట్లు పడియున్నదో చూడు మిపుడు చెపుము
ఎందుకొఱ కింత కుందెద వెఱుక లేక." 239

గీ. అతివ శ్రీరామసాంత్వనం బాలకించి
మానసంబున దుఃఖంబు మఱచెఁగొంత;
అంత శ్రీరామునాజ్ఞపై నర్కసుతుఁడు
ప్రీతిమెయి వాలి కుత్తరక్రియలఁ జేసె. 240

గీ. పిదప సౌమిత్రి రాముని ముదలఁ బొంది
నగరమున కేగి భానునందనున కెలమి

బట్టముం గట్టెఁ బాయక ప్రస్తుతింప
వాలిసుతునకు యువరాజపదవి నొసఁగె. 241

గీ. హనుమదాదులు శ్రీరాము నభినుతించి
యతనియనుమతిఁ బురమున కరిగి రఘుకు
శంకవిడనాడి సుగ్రీవు శయ్యఁగూడి
తార నూతనశృంగార తారయయ్యె. 242

గీ. కట్టుబొమ్మల నాడించుగతిని రాముఁ
డఖిలజీవుల నాడించి యలరుచుండు
సంతత మెవండు శ్రీరామచంద్రు నాత్మ
ధ్యానముం జేయునో వాఁడు ధన్యుఁ డగును. 243

ఉ. రామునిఁబోలు తండ్రి, రఘురామునిఁబోలిన తల్లి, జానకీ
రామునిఁ బోలు దేశికుఁడు రామునిబోలు పరోపకారి, శ్రీ
రామునిఁబోలు దైవము, ధరాస్థలి లేఁడనినమ్మి సర్వముల్
రాముఁడె యంచుఁగొల్చి స్థిరంబుగ స్వాస్థ్యముఁ బొందు నెయ్యెడన్

గీ. నరులు, మునులు, వేల్పులు స్వార్థపరులు, జగతి
నొక్క రామచంద్రుండె పరోపకారి
ఎంతకార్యంబునేన్ ధర్మచింతతోడఁ
జేయునే కాని స్వార్థ మాసింపఁ డెపుడు. 245

గీ. వనటచేఁ గ్రుంగి జీవచ్ఛవంబుభంగి
ముఖకళలఁ దక్కి యనిశంబుఁ బొక్కిపొక్కి
చిక్కి సగమైన సుగ్రీవుఁ జేరఁదీసి
అతులవాల్లభ్య మొసఁగె ధర్మానుసరణి. 246

గీ. అతులసుగుణాన్వితుండు విష్ణ్వంశభవుఁడు
చిత్కళాధాముఁ డగు రాజశేఖరుండు

రామచంద్రుండు సామాన్యరాజవరుఁడె?
భ్రష్టుఁడగుఁగాక యెఱుఁగక పామరుండు. 247

ఉ. రాముఁడు కోవిదుండు, డిన రాజసుతన్ బిలిపించి యిట్లనెన్
"భూమిని ధర్మమార్గమున భూపతు లేలవలెన్ సఖుండ! నే
ధీమహితుండనంచు రణధీరుఁడనంచు, భయంకరాయుధ
స్తోమముఁ జూపి యేఁచి ప్రజ దోఁచుకొనందగ దెట్టి ఱేనికిన్. 248

గీ. ప్రజలవిత్తంబు హరియింపవలయుననుచు
ఘోరపద్ధతులన్ నెలకొల్పఁదగదు
యోధులైన ప్రజల నిరాయుధులఁజేసి
అణఁచి త్రొక్కంగఁదగ దెట్టి యవనిపతికి. 249

చ. తనపరిపాలనంబుఁ బ్రజధర్మవిరుద్ధముగాఁ దలంచినన్
మనుజవిభుండు పద్ధతుల మార్చి ప్రజన్ దనియించుటొప్పుఁ దాఁ
గినుక వహించి మంచిఁ బలికింపక లోకుల బాధపెట్టి సొ
త్తు నపహరించు భూపతిని ద్రుంపవలెన్ పరరాజులెల్లరున్. 260

ఆ. వె. కుటిలరాజనీతి కోవిదుండగు రాజు
ప్రజకు ధర్మమునకు వైరి యగుచు
సకలలోకమునకు హానిఁగూర్చును గానఁ
దొలుత వానిఁజంపవలయుఁ జూవె." 251

గీ. రామచంద్రుండు బోధించు రాజనీతి
నర్కపుత్రుండు భక్తిమై నాలకించి
మంచి దని సమ్మతించి, నమస్కరించి
సత్కరింప నాహ్వానించె సదనమునకు. 252

గీ. "వినుము పదునాలుగేడులు వెడలుదాఁక
నగరుఁ జూడఁ బ్రతిజ్ఞ నగమునంద

వనునివసించెదన్ వర్షఋతువునందు
మఱవకుము నన్నుఁ గలనైన మానసమున. 253

గీ. అనిన విని యొంతమాటంటి వంబుజాక్ష!
నీవు వాసతి నాదల నేధరింతు
తరుణ మేతెంచు నందాకఁ దాళవలయుఁ
ననుచుఁ బ్రణతుఁడై సుగ్రీవుఁ డరిగెఁబురికి.

గీ. అంత రాముండు లక్ష్మణుం డనుసరింప
నవనిధరమున కేగి గుహాంతరమున
నోర్మిమై వాసముంజేసి యొక్కనాఁడు
ఎల్లదిక్కులఁ బరికించి యిట్టు లనియె. 255

—: వర్షఋతువు :—

గీ. మాటిమాటికి మేనఁ జెమ్మటలఁగ్రిక్కి
లోకు లెల్లరుఁ గాకఁ జీకాకుపడుచు
నున్నరని పుచ్చు వేడినిట్టూర్పుతోడ
భీష్మమగు గ్రీష్మ మెట్టెట్లొ వెడలెఁ జూవె. 256

గీ. రాజహంసలఁగారించి ద్విజల కెల్ల
నవ్వులనొసంగి ఘనుఁ డగు ఖ్యాతిఁబొందఁ
బాంథులను బాధపెట్టంగ బయలువెడలె
నరభసంబున నల్లదే జలధరుండు. 257

శా. హర్షోత్సిక్తమునన్ మయూరములు నాట్యంబాడఁగన్ మేఘసం
ఘర్షోద్భూతనినాదభీతకలవింకవ్రాతమై సాధ్వసో
త్కర్షోద్భ్రాంతమరాళజాలమయి, ధ్వాంతచ్ఛన్నభూగోళమై
వర్షాకాలము వచ్చె, జూచితివె దిగ్భాగంబులన్ లక్ష్మణా! 258

చ. ఫలములతోడ వృక్షములు । భవ్యసుమంబులతోడ వల్లరుల్
చెలువలరార, నందుఁగల । చిల్కలపల్కుల ముద్దులొల్క న
య్యలరులఁదేనె లానుటకు । నై మధుపంబులు సందడింప, నా
జలరుహనేత్రుఁ డెంతయును । నూతన మొందెఁ బ్రవర్షణాద్రిపైఁ

గీ. అఖిలరూపరేఖావిలా । సాదిగతుల
సకలమృగపక్షు లెలమిని । సంచరింపఁ
బ్రకృతిసంపద దీపింపఁ । బర్వతమున
హర్ష మిగురొత్త శ్రీరాముఁ । డలరుచుండె. 260

గీ. చదల నురుములు మెఱపులు । సందడింపఁ
గుంభములతోడ సలిలంబుఁ । గుమ్మరించు
కరణి బోసన వర్షంబుఁ । గురియుచుండఁ
జూడ సొంపుగ శోభిల్లె । క్షోణిధరము. 261

గీ. మునులు సిద్ధులు వచ్చి ద । ర్శనముసేసి
సంతసించుచు రాముండు । సంతతంబు
రాజనీతుల భక్తివై । రాగ్యములను
లలితగతిఁ దెల్పుచుండెను । లక్ష్మణునకు. 262

గీ. భక్తుల విరాగులంజూచి । వరగృహస్థు
లతులహర్షాంబునిధి నీదు । లాడునట్లు
జలదములఁగాంచి యెలమిఁ బిం । ఛములవిప్పి
నీలకంఠంబు లాడెను । లీలఁ గంటె. 263

చ. ఉఱుముల నాలకింపఁగ, వి । యోగులయుల్లము తల్లడిల్లు నా
మెఱపులకాంతి యస్థిరుల । మేనఁ బసింబసిగా వచించుఁ, జి
చ్చఱపిడుగుల్ వయింబడఁగ । నైనచెనగంబులు, కూర్చిచిత్తులం
జఱలనుబోలు నెగ్గుచు । పల్కగ నుత్తము లోర్చునట్లు వసి 264

గీ. వర్షధారలఁ బశుపక్షి వార మెల్ల
నించుకంతయు సైఁపక యేఁగించె
సాధుసజ్జన సరసప్రసంగములను
సైఁపఁజాలని కుజనుల చందమునను. 265

చ. పుడమిని చూడ సొంపయిన మొల్లల మ్రాఁకులఁ గూలఁద్రోయుచున్
పడిపడిఁ బొంగి యొడ్లొరసి పాఱెడు సీసెల యేళ్ళఁ గంటివే?
కడు నడుమంత్రపుం గలిమిఁ గాంచిన యల్పులు గర్వితాత్ములై
అడఁకువఁ దక్కి లోకులకు హాని ఘటించెడు రీతిఁ దెల్పెడున్ 266

గీ. మాయలోఁ బడు జీవుని మానసంబు
కడుఁ గళంకంబుఁ బొందిన కరణి, నహహా
వర్షసలిలంబు భూమిపైఁ బడినయంతఁ
దమ్ముఁడా! చూచితే కళంకమ్ముఁ బొందె. 267

మ. బలభిన్నాగకపోలదానజల మాస్వాదించి, హెచ్చోటఁ ద
జ్జలమొక్కమ్మడిఁ గ్రక్కవచ్చు మధులిట్సందోహముంబోలు నీ
జలము క్షుండచయంబుఁ గంటివె, ధరన్ సంతాపమున్ బాపి జీ
వులఁ గాపాడఁగ జాలు నౌషధములై పొల్పారు మున్మాటికిన్ 268

గీ. సజ్జనులు సద్గుణంబుల సంగ్రహించు
చందమున సరస్సులు వర్షసలిలములను
బడసి నిండుకొన్నవి నేత్రపర్వముగను
ఎలమిఁ గప్పలు కుప్పలై చెలఁగుచుండె. 269

గీ. ఈశ్వరుని బొంది జీవులు శాశ్వతముగ
నిశ్చలసుఖంబుఁ బొందెడు నియతిఁ దెలుప
పలునదులును వనధిన్ సంగమించు
సరసి కొలంది నానంద మతిశయించు. 270

గీ. పతితపాషండుల వితండ। వాదమునను
వేదమార్గంబు వినశించు। విధము దోఁప
సకలసత్పథములు । శాదమునను
గప్పఁబడియున్న చందంబుఁ । గాంచినావె. 271

సీ. బ్రహ్మచారుల వేద। పఠనంబు వరుసను
కప్పలబెకబెకల్ । కడలనిండ
విజ్ఞానవంతులుం । విలసిల్లు విధమున
నల్లమ్రాఁకులు విల। సిల్లుచుండ
సద్రాజ్యమున దుష్ట। జనసంతతిం బోలి
జిల్లేడుచెట్టుల । పెల్లణంగ
ధనకాంక్షఁగలవాని। ధర్మమార్గము భంగిఁ
బంకంబుచేఁ ద్రోవ । పొంక మెడలె

గీ. స్వార్థహితునిసంపద । ననుకరించి
పొలమునఁగల వరిచేను । పొలుపుమిగిలె
నధికముగ స్వేచ్ఛఁబడసిన। యతివఁ బోలి
కడువడిజలంబు ప్రవహించె । గట్టుదాటి 272

గీ. సంసరణసక్తనరుని య। జ్ఞానమట్లు
అంతటన్ జిమ్మచీకటి । యలముకొనియె
నప్పుడప్పుడు విజ్ఞాన । మంకురించు
గతిని ఖద్యోతకాంతియుఁ । గ్రాలుచుండె. 273

గీ. కామమోహలోభాదుల । గండడంచి
ఆత్మఁ బరిశుద్ధిఁ జేయు మ। హాత్మునివలె
బొల్లువడు గాబు మొలకలఁ । బెల్లగించి
క్షేత్రమును బాగుచేసెఁ గృ। షీవలుండు. 274

గీ. అంత్యయుగమున సకలవర్ణాశ్రమములఁ
గానుపించనికరణి నక్కాలమునను
స్త్రీపురుషచక్రవాకముల్ దినమునందుఁ
గానుపింపకయున్న వక్కటికదోఁచ. 275

గీ. ఎఱుకఁగలసాధుసజ్జనహృదయములను
లేశమైనను కామంబు లేనియట్లు
లూషరక్షేత్రములయందు నొక్కమొలక
యైనఁ గనుపట్టకున్నది యరసినావె? 276

గీ. ఎఱుకలభియించినంతనే యింద్రియములు
చేష్టలందక్క విశ్రమించినవిధాన
వర్షయోగంబునన్ సర్వపాంథజనము
విశ్రమముఁబొందె నెచటికి వెడలకుండ. 277

గీ. ఖలుఁడు పుత్త్రుఁడై పుట్టినకారణమునఁ
గులము ధర్మములు నశించు పొలుపుఁ దెలుప
వేగవినుచూలి చెలరేగి వీచుకతన
నెల్లమబ్బులు దిక్కులఁ జెల్లచెదరె 278

గీ. జలదసంగతి నినుఁడు తేజంబుఁదక్క
జలదమున్ బాసి యెంతయు వెలుఁగఁజొచ్చు,
నల్పసాంగత్యమున జ్ఞాన మంతరించు
నల్పులన్ బాసినన్ జ్ఞాన మతిశయించు. 279

—: శరదృతువు :—

శా. రాజద్రాజమరాళదంపతులసామ్రాజ్యంబు కాశోత్పలాం
భోజశ్రీదము, ప్రస్ఫురద్ధవళజీమూతంబు, నక్షత్రర
త్నౌజఃప్రస్ఫుటితాంబరంబు మధురజ్యోత్స్నాసుధాక్షాళితా
శాజాడ్యంబు శరత్సమాగమవిలాసంబున్ నిరీక్షించితే. 280

గీ. పండితంమన్యువిరసశబ్దములఁ బోలి
చదలను నిరస్తమేఘగర్జనలు హెచ్చు
వర్షఋతువునకున్ దోఁచు వార్ధకంబు,
బోలి పచ్చగడ్డికిఁ దెల్లపూలు పుట్టె.

గీ. ఆత్మసంతుష్టిచే లోభ మంతరించి
నట్లగస్త్యోదయంబున నంబువుల మ
హోల్బణమణంగ, వ్యామోహ మోరసిల్లి
నంత నైర్మల్య మొందిన స్వాంతమట్టు
లమలభావంబుఁ బొందె జలాశయంబు. 282

చ. కరము వివేకి కాత్మ మమకారమణంగుగతిన్ నదీసరో
వరములయుబ్బణంగె, నెఱవాది గతించినకల్మి వెండియున్
బొరసినమాడ్కి *ఖంజనముఁ బొందె గతించినదృష్టిఁ, జూచితే
శరదను; దత్సమాగమము చాల శుభప్రద మింతయేటికిన్.

ఆ. వె. నీతిఁదప్పనట్టి నృపతిరాజ్యంబున
ఈతిబాధ లణఁగు రీతిఁ దోప
బురద, ధూళి, లేక ధరణి యొంతయుఁ గ్రాలెఁ
జూడనొప్పు శరదసొంపుఁ బెంపు.

గీ. మునుపుబడసినకల్మిఁ గోల్పోయి మిగులఁ
బరితపించెడు ధనికుల వరుస నిపుడు
మాటిమాటికి నెంతయు మత్స్యకోటి
వ్యాకులముఁ బొందె నఖిల జలాశయములు. 285

* ఖంజనమనఁగాఁ గాటుకపిట్ట కాటుకపిట్టను, వర్షఋతువునఁ గంటిపై నొక రెక్క పుట్టును. దాన దృష్టిఁగోల్పవును. శరదృతువునఁ గంటిపైఁబుట్టిన రెక్క యూడి పోవును. వెండియు గతించిన దృష్టిఁ బడయును.

గీ. వినుము శిష్యా మరోగీంద్రిమనముభంగి
మేఘనిర్ముక్తగగనంబు మిగులఁగాఁ బ్రిలెఁ;
నెచ్చటనో యొక్కసద్భక్తుఁ డెనఁగునరణి
నెచటనో వానకురియు నీఋతువునందు. 286

గీ. ఆహవజయార్థులై రాజు లరుగువేళ
అమితధనకాంక్షఁ వర్తకు లరుగువేళ
యాచనార్థులై భిక్షుకు లరుగువేళ
తమ్ముఁడా మెల్లమెల్లఁగఁ దావరించె. 287

గీ. అమితసలిలాశయంబును నాశ్రియించి
సకలసౌఖ్యంబు లొందుమత్స్యములమాడ్కి
నచలభక్తులు దైవంబు నాశ్రియించి
అఖిలసుఖములఁబనయుదు రవనియందు. 288

గీ. జీవనమ్మిదవిమలసరోవరంబు
ఫుల్లరాజీవముల శోడఁ బొలుపుమిగిలి
సగుణరూపంబును ధరించి జగతిఁగాఁ బ్రిలు
నిర్గుణబ్రిహ్మమో యన నెగడుచుండె. 289

గీ. స్వాతివానను బడయక చాతకములు
దాహమున బాధపడుచుండె, దైవభక్తి
లేక సంసారదుర్భరక్లేశములను
బాధపడునట్టిమూర్ఖులపగిది సనఘ!. 290

క. శరదాతపపరితాపముఁ
బరిపాటిగఁ జంద్రిమసుఁడు వారించఁగదే
శరదుర్భర భవపావపుఁ
బరిపాకము సజ్జనుండు వారించుగతిన్. 291

గీ. చంద్రునిఁ జకోరములు చూచి । సంతసించు
చందమున భక్తవరుఁ జూచి । సాధుజనులు
సంతసించెదరని శర।త్సమయలక్ష్మి
పలుకుచున్నది పక్షుల।ధ్వనులమిషను. 292

గీ. భయదభవపాపములు దైవ। భక్తివలన
క్షయముఁ బొందినగతి శర। త్కాలమునను
మశకమత్కుణకోటి హి।మాంతమునకు
క్షయముఁబొందెనుఁ గాదె ని।స్సంశయముగ 293

గీ. సద్గురువు నాశ్రయింపంగ । సకలమోహ
కామలోభాదులు నశించు।కరణి, వర్ష
ఋతువునన్ బుట్టిపెరిగిన । యెల్లక్రిములు
ఈశరత్కాలమునఁ బొందె । నాశనంబు. 294

గీ. హర్షమెసఁగంగ వెడలెను । వర్షఋతువు
శరద యేతెంచె దిశలఁ దే।జము రహించె
సమయ మియ్యది కార్యంబుఁ । జక్కఁజేయ
నెచటనున్నదో నాసీత । నెఱుఁగు టెట్లు. 295

శా. చిత్తం బెంతయుఁ దల్లడిల్లెనుగదే । సీతన్ విలోకించి త
ద్వృత్తాంతంబు నెఱుంగఁజేయుటకు సు।గ్రీవుండు రాఁడాయె, వా
గ్దత్తజ్ఞానము లేక నన్ మఱచెనో । తారన్ విలోకించి యా
ద్వృత్తిన్ బొందెనొ రాజ్యసంపదలచే । గ్రీడావిలోలాత్ముఁడై.

గీ. నెలఁత మొచ్చబైన జీవించి । నిలిచియున్న
నరిగి తెచ్చెదఁ గాలుఁ గై।నైన గెలిచి
ఉనికి యెఱిఁగింతునని బల్కి । యినసుతుండు
రాజ్యమదమున మఱచి తా । రాకయుండె. 297

క. వాలిన్ నేలంగూల్చిన
కోలన్ సుగ్రీవు నెట్లు గూల్చెద? లీలన్
నేలన్ నాటిన మొలకను
కేలన్ నే నెట్లు పెల్లగించెద, జెపుమా? 298

శా. చూడాబద్ధకిరీటకాంతి దిశలన్ శోభిల్ల గర్వించి, పూ
బోడిం గూడి మదించి, మైమఱచి, యామోదాబ్ధిలో నీదుచున్
పాడిన్ దప్పెనొ గాక రాముఁ డెవఁడో భావించెనే వెంటనే
రాఁడా? కార్యవిధానమున్ దెలుపఁడా? ప్రావీణ్యమున్ జూపఁడా?

గీ. రామ మనసంధకారంబు కనులఁ గప్పె
నెండియు నఖండసంపదన్ బెంపుఁ గాంచె
మన పురాతనస్నేహంబు సీసనుతుండు
రాజ్యమదమున మఱచు టబ్రింబె చెపుమ. 300

వ. అనినన్ లక్ష్మణుఁ డాగ్రహించి నిజబాహుదండయుగ్మంబునన్
ధను వొక్కమ్మాడి నెక్కు వెట్టి, "యిప్పుడే దండింతు సుగ్రీవు నో
యనఘా! వేగమ యానతి" మ్మనిన యోధాగ్రేసరున్ లక్ష్మణున్
గని ప్రేరింపక రాముఁ డిట్లనె నహంకారంబు వారించుచున్. 301

ఉ. తమ్ముఁడ! యాగ్రహించి మదిఁ దాలిమిఁ దక్క, కృతఘ్నుఁ డంచు మో
హమ్మునఁ గార్యమున్ మఱచినట్టి మదీయసఖున్ వధింప నొ
క్కమ్మడి సాహసింపక, కటూక్తులఁ బల్కి భయంబుఁ గొల్పి, శీ
ఘ్రమ్మగ వానిఁ దోడుకొనిరమ్మఖిలమ్మనుకూలమయ్యెడిన్. 302

గీ. రాముఁ డిట్లు తమ్ముని దురాగ్రహ మణంచి
"అతఁడు వ్యామోహవశమున నాదమఱచె
అంతమాత్రాన వధియింప నర్హ మగునె"
అనుచు బోధించు చుండ నయ్యవసరమున. 303

క. మతిమంతుఁడు హనుమంతుఁడు
కృతకృత్యుం డగుట వానరేశుఁడు సీతా
పతిగతి మఱచెఁగదా యని
అతిశీఘ్రము వెడలి వానరాధిపు గనియెన్. 304.

గీ. మదనునకుఁ జిక్కి సర్వంబు మఱచిపట్టి
అర్కసుతునకు మ్రొక్కి యయ్యనిలసుతుఁడు
హస్తములమోడ్చి శ్రీరాము నాత్మఁదలఁచి
ఎక్కసక్కెంబుగా నవ్వి యిట్టులనియె. 305.

చ. "మఱచితివో రఘూద్వహుల మానసవీథి, సధర్మపద్ధతిన్
గఱచితివో? కృతఘ్నుఁడనఁగా నిటు లక్కట స్నేహధర్మమున్.
జెఱచితివో? రఘూద్వహుఁడు చెప్పినకార్యవిధాన మెట్టు లే
ర్పఱచితివో యథార్థమును బల్కు మొకింతుక వానరేశ్వరా !. 306.

గీ. భేదదానదండోపాయ విధులు విడిచి
సామమున సౌమ్యమున నిన్నుఁ జక్కఁజేసె
మాధవుని రామచంద్రుని మఱచినావె ?
వానరేశ్వర! దూతలఁ బంపినావె?". 307

గీ. అనినవిని త్రుళ్ళిపడి లేచి యర్కసుతుఁడు
విషయవాంఛకు లోనైతి వెడఁగుభాతిఁ
బవననందన ! దూతలఁ బంపి తొలుత
వీరవానరవరుల రప్పింపవలయు. 308.

గీ. వేగము గవారు రాకున్న విడువకుండఁ
జెలఁగి యెవ్వారి నేని శిక్షింతుననుము
సకలరిపునాశనము నాదు శాసనంబు
నిపుడ చాటింపుమా వేగ మెల్లదెసల. 309.

గీ. అంత హనుమంతుఁ డతిశాంతుఁ డాక్షణంబ
సక్రమంబుగ రాజశాసనముఁ దెలిపి
ఎల్లెడంగల వానరమల్లవరులఁ
దోడితెం డని దూతలఁ దొలుతఁ బంపె 310

ఉ. అంతట నంగదుండు విస్మయాన్వితుఁడై చనుదెంచి యావివ
స్వంతతనూజుపాదములపైఁబడి మ్రొక్కి వచించె నిట్లు, "ధీ
మంతు యశోనిశాంతు హనుమంతునిఁ బంపిన నాదరించి ది
గ్దంతులఁబోలు వానరులు దప్పక వత్తురు వానరోత్తమా! 311

చ. సరసుఁడు బుద్ధిమంతుఁ డతిశాంతుఁడు, ద్వీపములన్ కులాద్రులన్
సరసుల సాగరంబులను చాలనెఱింగినవాఁ డసాధ్యుఁ డె
వ్వరికిని చిక్కనట్టి బలవంతుఁడు, సర్వమునీంద్రకోటితోఁ
బరిచయమున్నవాఁ డితనిఁ బంపుము కార్యము సానుకూలమౌ.

గీ. అనినవిని యర్కనందనుఁ డనిలసుతుని
వెడలిరమ్మని వంత వాపీరవరుఁడు
మంచిదని సంతసించి కుప్పించి మొగసి
ప్రాగ్దిశకునేగి వానరవరులఁ జూచె. 313

గీ. గయగవాక్షు లనేకలక్షలకొలంది
వానరులతోడ శీఘ్రంబ వానరేశు
నికటమున కేగి వినతులై నిల్చి మ్రొక్కి
అతనిచే మన్ననలఁ బొంది రధికముగను. 314

సీ. గయగవాక్షులఁ బంపి కడువడి వాయునం
దనుఁడు రోహితపర్వతమున కేగి
అరిలోకదుర్ధర్షుఁ డైనదుర్ధర్షుని
వీక్షించి రాజాజ్ఞ నెఱుకచేసి

అటనుండి శీఘ్రంబ । వ్యాహారపర్వతం
బునకేగి బలవీరు । ఁడనెడువానిఁ
గీశసేనాధ్యక్షుఁ । గిష్కింధకుంబంపి
యటనుండి ధుంధుమా । రాద్రికరిగి

గీ. బలుల శ్రీఖండ వానర । వరులఁబంపి
కదళికం జేరి యటనుండి । గజునిఁబంపి
అంజనాద్రికి వెడలి మ । హాబలాఢ్యుఁ
గుముదునిం బంపి నీలశై । లమునుదరిసి. 315

గీ. సేనఁ బరికించి సుగ్రీవు । నియతిఁదెలిపి
అతనిఁ గిష్కింధకుంబంపి । యాతఁడంబ
బదరికాశ్రమముంజూచి । పిదప గంధ
మాదనాద్రి నీక్షించె సం । మోదమెసఁగ. 316

గీ. అచటఁగలవానరులకు రా । జాజ్ఞఁదెల్పి
అర్జునాద్రికిఁ గప్పించి । దుర్జయుని సు
షేణుఁ దారతండ్రినిఁబంపి । శీఘ్రముగను
మేరుగిరిఁజేరె వానర । విభు లలర. 317

సీ. తరుణార్కబింబంబు । కరణి భాసిలుదివ్య
వదనాంబుజంబుతో । వఱలువాని
శరణాగతులఁబ్రోచు । కరుణారసంబున
శోభిల్లురమ్యచ । క్షుర్యుగళవాని
నరసురనుత మేరు । నగమును మెచ్చని
ఘనశరీరంబుతోఁ । గ్రాలువాని
ఇంద్రచాపముభంగి । నెసఁగువాలం బెత్తి
వాయువేగంబున । వచ్చువాని

గీ. అంతటితుంబు నొక్కట । నాక్రమించు
నురుతరస్థూలదీర్ఘబా।హువులవాని
ననిలపుత్త్రునిఁ బిలిచి । యాదరించి
ఆజ్ఞఁ బాలించి రచటి కీ।శాధిపతులు. 318

గీ. వీరకేసరి యనుకీశ।శూరవరుఁడు
అఖిలవానరకోటి సై।న్యములతోడ
హనుమపంపునఁ బంపకు । నపుడ వెడలెఁ
సేనల గణింపఁజాలఁ డా।శేషుఁడైన, 319

గీ. రుద్రగిరికేగి పిదప ని।ర్నిద్రగతిని
పరమపావనకైలాస।పర్వతస్థ
వానరశ్రేణిఁ బంపకుఁ । బంపి పిదప
రాలకాపురిఁ బిలిపించె । ననిలసుతుఁడు. 320

చ. అలకఁగలట్టివానరకు।లాధిపు లెల్లరుఁ గొల్చియుండ ని,
స్తులబలవంతుఁ డీతఁ డను।చున్ దనకాయ మెఱుంగఁజేయ, మా
యలఁ బచరించి దానవుల । కంతకుఁడై తనరారు వాని, నా
బలపురదున్ గనుంగొనియె । వాయుసుతుండు ప్రఫుల్లదృష్టితో

గీ. బలపురదుఁ డంత లేచి పా।వని కెరంగి
అతనియానతిఁ దలఁదాల్చి । యాతఁడంబ
చెప్పఁగారాని వానర।సేనతోడ
బెంపు దీపింపఁ బావకు । వెడలె వడిని. 322

గీ. జయము జయము శ్రీరామల।క్ష్మణుల కనుచు
జయము సుగ్రీవునకు రామ।సఖున కనుచు
గంపు మీఱిన మిడుతల।దండుఁబోలి
వేయులక్షలవానరుల్ । వెడలి రపుడు. 323

గీ. పిదప మైనాకపర్వత|వీథి కేగి
అచటఁగలవానరశ్రేణి | కానతిచ్చి
మంచుమలకేగి వానర|మండలాధి
పతిని నందకనాముని | బంపె నతివ! 324

చ. కరువలిపట్టి వింధ్యగని | గంధగజంబుల నొక్కతోకతోఁ
గరకరిఁ గొట్టఁజాలినయ|ఖండబలాఢ్యు వసంతనామవా
నరపతి కానతిచ్చి, ఖగ|నాథుని మించుజవంబుతోడ సుం
దరమగునింద్రకీలవని | దారుకొనెన్ నయనోత్సవంబుగన్.

ఆ. వె. ఇంద్రకీలిలోన | నెసఁగు వానరకోటి
అనిలపుత్త్రునాజ్ఞ | నవధరించి
అతిబలుండు రాముఁ|డరి జైత్రుఁడగుఁగాక
యనుచు వెడలెఁ బంప | కాతుణంబ 326

చ కరువలిమించువేగమునఁ | గశ్యపపర్వతసీమ కేగి, యం
దిరువదియొక్కకోటులకు | నీశ్వరుఁడై నివసించు వీరవా
నరపతి మైందవర్యుఁ బిలిచి | నవ్వుచుఁ గర్జ మెఱుంగఁజేసి స
త్వరగతి వాయుజుండతనిఁ | బంపకుఁ బంపె సురల్ నుతింపఁగన్.

ఉ. నీలుఁడు దగ్ధదాంధరజ|నీచరకోటి వధింపఁగన్ మహా
కాలుఁడు సాధుకోటి కుప|కారమొనర్పఁగ సంచరించు న
చ్ఛీలుఁడు సాటిలేనికపి|శేఖరునానతి నాదరించి మేల్
మేలని మూఁడుకోటులను | మించిన వానరసేనతోఁ జనెన్. 328

గీ. ధవళగిరినున్న దుర్ధరుఁ | దత్క్షణంబ
చెలఁగి శతకోటి కేని భీ|తిలక నిలుచు
బలుల శతకోటి వానర|వరులనిచ్చి
పంపకుం బాపి వెడలె న|వ్వాయుసుతుఁడు. 329

గీ. ఉదయగిరి కేగి యుండు సభ్యుదయ మొందు
కుముద, కుందుల వానర । సముదయాధి
పతులఁ గిష్కింధకుం బంపి । వాయుగతిని
వెడలి భూతలం బంతయు । వెదకఁ జొచ్చె. 330

గీ. ఎల్లెడంగల వానర । మల్లవరుల
వెదకి పంపాపురీశ్వరు । ముదలయుచుచుఁ
బాపకుం బంపి శీఘ్రంబ । వాయుసుతుఁడు
మగిడి చనుదెంచె నెలవున । కగకుమారి. 331

గీ. వానరోత్తాల వాల వి । తానముఁ గని
మాకుఁగల తేజ మంతరిం । పఁగ విరించి
రాహుకేతువులన్ బెక్కుఁ । దను సృజించె
ననుచు దాఁగిరి చంద్రుఁడు । సజ్జహితుఁడు. 332

సీ. మిసుశలదాసువా । వెడలిన వానర
సైన్యంబు లెక్కింప । శక్యమగునె?
వాయువేగంబున । వానరుల్ వెడలంగ
దేవతావితతి భీ । తిల్లఁ జొచ్చె
సాంద్రాంధకారంబు । చంద్రసూర్యుల మ్రింగి
యంతరిక్షంబున । నలముకొనియె.
కహకహారావముల్ । కడల మార్మ్రోఁగంగ
దైత్యులయుల్లముల్ । తల్లడిల్లె

గీ. అతిబలుల్ రామలక్ష్మణు । లానావమున
శత్రులజయింతురనెడు సు । త్సాహజనిత
జయజయధ్వాన మాకల । సంక్రమించెఁ
గాలుఁ దప్పెడు లంకలోఁ । గాలు వెట్టె. 333

గీ. అతులలంకావిజయకేతు। పతనహేతు
ధూమకేతువుఁ బోలిన। స్థూలదీర్ఘ
వాలముఁ మీఁదికెత్తి వే। వచ్చినట్టి
హనుమఁ గాఁగిటంజేర్చె న। య్యినసుతుండు. 334

ఉ. అంతట లక్ష్మణుండు నిజ। హస్తమునన్ విలుఁబూని యుగ్రుఁడై
ఎంతయుఁ గన్నుదోయి జని। యించినకెంజిగి దిక్తటంబులం
దంతటఁ గొంత క్రమ్మఁగొన। నాస్యమునన్ బ్రళయార్కకాంతియొ
క్కంతరహింప "భానుసుతుఁ। డెచ్చట" యంచరుదెంచెఁ జెచ్చెరన్.

ఉ. వచ్చినవానిమోముఁగని। భానుతనూజుఁడు ఱిచ్చపాటునన్
హెచ్చుగఁ దల్లడిల్లెఁ గపు। లెల్లరు భీతిలి రంత నంగదుం
డచ్చటి కేగుదెంచి విన। యాన్వితుఁడై పడినంత లక్ష్మణుం
డచ్చపుఁబ్రేమతో నతని। నాదటఁ గౌఁగిటఁజేర్చె నత్తఱిన్. 336

గీ. తార యేతెంచి "యనఘ! సం। సారధర్మ
మెట్టిదో బుద్ధిమంతుఁడ। వెఱుఁగుదీవు
తప్పుఁ క్షమింపు" మనుచుఁ బా। దములవ్రాలి
నంత, నవ్వుచు సుగ్రీవు। డనియె నిట్లు. 337

గీ. "అనఘ! విషయమదంబున। కగ్గమైన
వాఁడు సదసద్వివేకంబుఁ। బడయఁగలఁడె
మోహవశమున నింద్రియం। బులకుఁజిక్కి
మునులు సైతము భ్రమియింతు। రనఁగ వినవె?" 338

గీ. అంత హనుమంతుఁ డతులధీ। మంతుఁడగుటఁ
బజ్జకేతెంచి సౌమిత్రిఁ। బ్రస్తుతించి
యఖిలదేశంబులందుండి। యరుగుదెంచి
నట్టి వానరవీరసై। న్యంబుఁ జూపె. 339

గీ. మేలు మే లని సౌమిత్రి మెచ్చి లిచ్చి
వారలన్ దోడుకొని రామభద్రుఁ జేరి
మ్రొక్కు లర్పించి యెఱిఁగించి పొంతనిలిచె
వినయముతోం డంత నిట్లనె వినతుఁ డగుచు. 340

గీ. "ప్రబలమగు నీదు మాయావరణమునందుఁ
జిక్కుకొని యాదమఱచితిఁ జన్మయాత్మ!
ఎట్టి జ్ఞానియు విషయేచ్ఛ కీడిగిల్లుఁ
బామరుఁడ నేనవఁగ నెంత వాఁడఁ జెపుమ. 341

గీ; మునులు పామరు లమరులు మోహమనెడు
నురులకుంజిక్కి తరుణులు మరులుకొంద్రు
ఎవఁడు వ్యామోహమను రాత్రి కవశుఁడై చ
రించు, వాఁడు నీకు సమానుఁ డౌను దలఁతు. 342

గీ. పామరుఁడు నింద్రియములకుఁ బట్టువడక
జ్ఞాని కావచ్చు సంతతసాధనమున
నింతకు భవత్కటాక్ష మొక్కింతయున్న
సర్వము లభించు ననుకూలసమయమునకు. 343

ఉ. రూపు లనేకవర్ణముల శోభిలు వానరు లుక్కుమీఱు వాం
ఛీరులు, దుష్టదానవుల పీచమణంపఁగఁజాలుధీరు లే
తేరఁగఁజూచి రాఘవుఁడు దివ్యవిపల్కులఁ బెక్కుభంగులన్
వారల సత్కరించి, ప్రతివానరునన్ దయఁజూచె సత్కృపన్.

గీ. రామచంద్రుని సత్కృపారసమునందు
స్నానము జేసి యొక్కొక్క వానరుండు
రామ! గుణధామ! సంగ్రామభీమ! యనుచు
వచ్చి మ్రొక్కిరి రాముని చరణములకు. 345

గీ. పంకజాక్షునికరుణకుఁ బాత్రులైన
వానరుల నేను జూచితిఁ బంకజాక్షి
వరుస రిక్కల లెక్కింపవచ్చుఁగాని
వార లెందఱో లెక్కింప వలనుపడదు. 346

గీ. ప్రతిసుమంబున మధుపున్నగతిఁ జెలంగి
ఎల్లవానరవీరుల హృదయములను
సంచరించె నాచరాచరచక్రవర్తి
రాముఁడు నరుండె? యాది నారాయణుండు. 347

గీ. అంత సుగ్రీవుఁ డఖిల కీశాధిపతులఁ
గాంచి యిట్లనె "మీరు రాఘవులకార్య
దీక్షతో నేగి యెల్లెడఁ దిరిగి తిరిగి
జానకిని జూచి రావలె సత్వరముగ. 348

గీ. ఏమఱక యాలకింపుఁడీ యెల్లకపులు
నొక్క నెలమాత్రమే గడువొసఁగినాడ;
అవనిసుతఁ జూడఁజాలక యవధిదాటి
అరుగుదెంచిన వధియింతు నాక్షణంబ. 349

చం. వసలనిపట్టుతో సకలవానరవీరులు భూమిభృన్నదీ
నదముల సాంద్రనిర్జన వనంబుల దుర్గమకందరంబులన్
అదవదఁ దక్కవేగ చతురబ్ధిపరీతధరాతలంబులోఁ
గదలసి తాల్మితో వెదకి తొమ్మసుకతా వెతి గిఁవఁగావలెన్. 350

గీ. అవనిసుతఁగూర్చి యెల్లర నడిగి రండు
అవనిఁ గల సర్వదేశంబు లరసి రండు
మీరు మూడనితావెందు మిగులరాదు
మహితగుణధాము శ్రీరాము మఱవరాదు. 351

ఆ. వె. గజగవాక్షులార । కార్యంబుసాధింప
వేగ తూర్పుదిక్కు । వెదకిరండు
గడువుదాటకుండఁ । గలదేశములనెల్లఁ
గలయఁజూచిరండు । కదలిపొండు. 352

గీ. తదుపరి సుషేణుఁ బిల్చి "మైం । దవుఁడు నీవు
నుత్తరపుదిక్కునకుఁబోయి । యుర్వీపుత్త్రి
నరసి చనుదెండు వేగంబ । యాలసింపఁ
దగదు, నేఁడిడినగడువును । దాటవలదు. 353

సీ. గంధమాదనమును । గాంచి, మేరువుఁ జూచి
నీలార్జునాద్రుల । నెలవులఁ గని,
కైలాసగిరి కేగి, । కలశుహాల్ పరికించి,
అలకాపురీవార్త । లాలకించి
యక్షగంధర్వుల । సందడిఁ దిలకించి
పృథ్వీసుతం గూర్చి । పృచ్ఛఁ జేసి
మానసంబున కేగి । స్నానంబులం జేసి
క్షుత్పిపాసలఁ దీర్చు । కొనఁదలంచి

గీ. అతులఫలభారవినమిత । క్షితిరుహాళి
మధురపరిపక్వఫలముల । మాత్రముఁ గొని
బడలికం దీర్చి వెండియు । వెడలవలయుఁ
బ్రాణిగన్పట్టినఁ జాలు । నడుగవలయు. 354

చ. తదుపరి మ్లేచ్ఛదేశమును । తద్గిరులన్ దరులన్ వనంబులన్
బొదలనుజూచి యుత్తరస । ముద్రముఁ జూడుఁడు తత్ప్రదేశముల్
వెదకుఁడు, మంచుచే జలము । పేర్కొనవచ్చుట సూర్యకాంతియుం
డదు, వెనుకీయకాపయిఁ జ । నందగు మెల్లఁగ శ్వేతభూమికిన్. 355

గీ. అవనితల మెల్ల సంతతో । నంతమగును
మగిడిచను డెందు, కైలాస। నగమునందు
పండితవరుండు కాకభు। శుండిగలఁడు
అతనిదర్శించి, శీఘ్రంబ । యరుగుడెందు 356

గీ. తన్నగసమీపమునఁ బవి। త్రితనుగన్న
స్వచ్ఛజలకుండ మొండు గ। న్పట్టుమీఁదు
తలఁప నమృతోపమానంబు । తజ్జలంబు
కమ్రకర్పూరమయము త। త్కర్దమంబు. 357

గీ. సారవంతంబు తత్ప్రదే। శంబు, పొంత
నున్నతమగు జంబూవృక్ష । మొండుగలదు
అస్థలంబు జంబూద్వీప । మనఁగబరఁగు
నయనపర్వంబు దాని సం। దర్శనంబు. 358

గీ. మత్తశుండాలముండో। మానమధుర
పక్వజంబూఫలరసంబు । వలనఁ గూఁడ
మెల్లపుడు నిండుకొనియుండు; । నల్లమలర
నమరు లాకుండమున స్నా। నమాచరింత్రు. 359

గీ. డంబుమీఁజెనయట్టి కుం। డంబునుండి
బిందునది ప్రవహించుచు । నుండు నెపుడు
అదియు, సరయూనది యనంగ । ఖ్యాతిఁగాంచె;
అందు మునిఁగినఁజాలు వి। యఘము లణఁగు. 360

గీ. పిదప శ్రీరామనామంబు । నెదస్మరించి
శూరసేనమండపమును । జొచ్చి, యందు
నెల్లపుడునుండు లోమశ। ఋషివరేణ్యు
దర్శనముఁజేసి మ్రొక్కఁ ద। లంచు ఘనుఁడు. 361

గీ. లోమశునిశరీరమునుండి । రోమ మొకటి
రాలిపడుచుండు నొక్కొక్క । ప్రళయమునకు
అవనిసుతఁగూర్చి యాతని । నడిగిపిదప
ఘనుని శాండిల్యమునిఁ జూడఁ । గలరు మీరు. 362

సీ. వానరుల్ కొంద ఱక్వకాంతమున ఋషి
రోమపటచ్ఛర । సీమ లరసి,
సైనికకుక్కుట । స్థానంబులన్ జూచి,
పశుశీలమున్ గాంచి, । ప్రళియముఁగని,
క్రౌంచమున్ గని, మార । కముయాటకముఁ దామ
సముఁజూచి, యావర్త । నమున మెలఁగి,
ముఖ్యముగఁ దురుష్క । భూమిఁ బరీక్షించి,
అశ్వీయదేశర । హస్య మెఱిఁగి,

గీ. కానివలము, బర్బర రథ । కాంతములను
వెదకి, పిదప విష్ణుకాంత । విషయములను
మెలఁగి, చీనమహాచీన । ములఁ జరించి,
తాళశోమ కాత్యన్నత । స్థలులఁగనుఁడు. 363

గీ. స్వర్ణభూమినిఁజొచ్చి, స్వే । చ్ఛగఁజరించి,
పార్వతావర్తపారస్య । పహ్నవముల
బ్రిహ్మదేశోపమల్వక । రమణకముల
దరదలింగదుర్గద్వీప । తలహములను. 364

గీ. తిరిగి, పడి నవకాంత ప్రి । దేశముఁగని
కాంచనప్రస్థవీథులఁ । గలయఁజూచి
తోవఁగనష్టమునుల సా । ధువుల కెరఁగి
వారలయాదంతము గ్రహింప । వలయు మీరు. 365

శా. కారస్కారతుషారశూన్యయవనగ్రామంబులం జూచి, గాం
ధారంబుం బరికించి, పంచనదములన్ దర్శించి, శీఘ్రంబ కా
శ్మీరంబుం దిలకించి, తద్గిరిగుహాశ్రేణిం విలోకించి, గం
భీరాంభోధినదీపరీతసకలద్వీపంబులం జూచుఁడీ. 366

మ. శ్రీమఁ బాటించక కోసలంబు, మిథిలన్ సౌవీర సౌరాష్ట్ర భా
గములన్, కేకయ వారణాసి కురు జంగాలంబులన్ కాన్యకు
బ్జముఁ బుండ్రోత్కళ కాంచి మాహిష కచం పావంగ గాడోపవం
గ మహాదేశములన్ గనుంగొని కళింగంబున్ విలోకింపుఁడీ. 367

గీ. మగధఘూర్జరేంద్రప్రస్థమత్స్యకిలకి
లామహాప్రదేశంబులఁ, గామరూప
శూరసేనాదులన్ జొచ్చి, చూడవలయు
నతిరహస్యప్రదేశంబు లరయవలయు. 368

క. ఈ యా దేశంబన నే
లా? యావద్భూతలంబు నవలోకింపుం
డాయాసంబని యెంచక;
మా యానతిఁ దప్పకుండ మన్నింపవలెన్." 369

చ. అన విని వీరరాఘవుఁడు "ప్రాణసఖా! యెవు డిన్నిదేశముల్
కనుఁగొని వచ్చితి" వనినఁ గన్నులనీ రొలుకంగ నాతఁ డి
ట్లనె "ననఘా! మదగ్రజాభయంబునఁ బూర్వము పర్వతంబులన్
వనముల సర్వదేశముల వాసముఁ జేసితి వేషధారినై. 370

గీ. ఇంద్రతనయునిభీతిచే నెల్లదెసల
సంచరించితి సకలదేశములఁ గంటి
నే నెఱుంగని నదులు వార్నిధులు లేవు
అనఘ! నేఁటికిఁ దత్ప్రయోజనముఁ గంటి." 371

గీ. పిదప సుగ్రీవుఁ డత్యుగ్రవీరవరుల
శతబలవసంతులను కీశపతులఁ బిల్చి
ధీరవరులార! పశ్చిమదిశకు వెడలి
స్వామికార్యంబు సాధింపవలయు మీరు. 372

గీ. రంగభూమిఁ బరీక్షించి రండు కొంద
అన్యదేశంబులన్ గొంద ఆరసిరండు
శ్రద్ధతో స్వామికార్యంబు జరపవలయు
నెలగడువుదాటిన వధింతు నిక్కువముగ. 373

గీ. సకలసేనావనవసంత! జాంబవంత!
అతుల బలవంత! హనుమంత! యరికృతాంత!
అంగదా! దోర్బలాంగద! యసురకాలు
లార! నలనీలులార! బలాఢ్యులార! 374

గీ. స్వామికార్యంబు సాధింప సమయ మిదియ
శక్తివంచనలేకుండ సత్వరముగ
దక్షిణాశకుఁ బయనమై ధరణిపుత్రి
యునికిఁ బరికించి, సద్యశోధనముఁ గొండు. 375

ఉ. భోగవిలాసలాలసులు భూస్థలి శాశ్వతమంచు నెంచి, మా
యాగతి నంధులై భవమహాంబుధిలోఁ బడి, మోక్షసాధనో
ద్యోగముఁ దక్కి, పాపులయి యూరక చచ్చుచు బుట్టుచుంద్రు బా
గోగుల నిర్ణయించి జనుఁ డుత్తమమార్గముఁ బొందుటొప్పదే? 376

గీ. రామచంద్రుండు దేవతారాధ్యుఁ డతని
చరణములఁ గొల్చి, సంసారజలధి దాటి
పరమపదమును సాధింపవలయు మీరు
పుణ్యమతులార! వీరాగ్రగణ్యులార. 377

గీ. అవనిఁ బ్రతిదేహి రామపాదాంబుజముల
గొలిచి, తన్నామమంత్రింబుఁ దలఁచి తలఁచి
పంకమయఘోరసంసారవార్ధిదాటి
తత్వము గ్రహింపవలెఁ గాదె తమ్ములార. 378

గీ. కంటికిఁ గానరాని మోక్షంబుకంటె
నైహికసుఖంబు మిగులఁ దీయ్యముగనుండు
రామచంద్రుని సేవ కర్తవ్య మనుచు
భక్తిని భజించుజనుఁడు పావనుఁడు ఘనుఁడు. 379

గీ. ఈశరీరంబు తుచ్ఛము చేవగించి
రామకార్యంబు సాధించి రామనామ
మంత్రము స్మరించుచున్ వేగ మగిడిరండు
ఘనతదీపించ సద్యశోధనముఁ గొండు. 380

గీ. అనిన సుగ్రీవువానతి నవధరించి
జాంబవంతుండు జయమని సన్నుతించె
నానని నమస్కరించి రయ్యంగదుండు
నలుఁడు నీలుండుఁ గేసరి నందనుండు. 381

గీ. వానరశ్రేష్ఠు లెల్లరుఁ బయనమునకు
యత్నములఁ జేయుచుండంగ నాంజనేయుఁ
డలమి శ్రీరాముపాదాబ్జములకు మ్రొక్కి
"ఆజ్ఞ" యని నిల్చె దేవత లభినుతింప. 382

గీ. అంత జానకీకాంతుఁ డేకాంతముగను
"అహహ! హనుమంత! మతిమంత!" యని నుతించి
తనదుముద్రికనొసగి మంత్రనములాడి
శీర్షమున హస్తముంచి యాశీస్సు లొసఁగె. 383

క. హనుమా ! వినుమా జానకిఁ
గనుమా, రాముండు నిన్నుఁ గైకొను నిక్కం
బనుమా, యనుమానము వల
దనుమా, నీ కెల్లెడల జయంబగుఁ జనుమా." 384

గీ. అనిన విని మ్రొక్కి ధ్యానించి యభినుతించి
అహహా ! జన్మంబు సార్థకమయ్యె ననుచు
స్వామికార్యంబు సాధించి వత్తు ననుచు
హుంకరించి, జృంభించి యహంకరించి. 385

మ. "పరుఁడై శాశ్వత ధర్మకర్మపరుఁడై వాగ్వర్ణనాతీతుఁడై
స్థిరసౌఖ్యప్రదమోక్షరాజ్యపదవీసింహాసనారూఢుఁడై
వరభక్తాంబుజభాస్కరుండయి, ననున్ బాలింప శ్రీరాముఁడై
ధరణిన్ బుట్టినయాదిదేవుని కృపన్ ధన్యుండనైతింగదా. 386

ఉ. శ్రీరఘురామచంద్రుఁ గికురించిన క్రూరుని, నత్పతివ్రతా
చోరునిఁ, జూచి, వానిపురిఁ జూచి, సతీమణి యున్కిఁ జూచి, దు
ర్వారపరాక్రమక్రమము వైరుల కించుక వెల్లడించి, హాం
వీరులు భీతిలన్, సురలు మేలని మెచ్చఁగ, నేగుదెంచెదన్." 387

గీ. అనుచుఁ గొండంత యుప్పొంగి యాత్మయందు
రామచంద్రుని ధ్యానించి ప్రస్తుతించి
రామ రఘురామ యని మ్రొక్కి రాఘవులకు
జయము జయమంచు వెడలెఁ గేసరి సుతుండు. 388

ఉ. వానరు లెల్లరన్ నదుల వార్ధులఁగాంచి యతిక్రమించుచున్
గాననవీథులన్ గిరుల గ్రామములన్ దిలకించి యష్టది
క్స్థానములన్ భ్రమించుచు వెసన్ జనుచుండిరి రామచంద్రునిన్
ధ్యానముఁ జేయుచున్ హనుమదాదులు పోయిరి దక్షిణాశకున్-

గీ. హనుమయుఁ జాంబవంతుండు । నంగదుండు
నలుఁడు నీలుండు వీరవా।నరవరేణ్యు
లరయ నిరువదికోటు ల।హంకరించి
దక్షిణంబున కేగి రు।త్సాహమునను. 390

ఉ. మానసముల్ స్థిరంబులయి । మానక రాముని కార్యదీక్షలో
లీనములై రహింప, నవ।లీలఁ బథంబు నతిక్రమించుచుఁ
వానరు లేగుచుండ, ననివార్య బలాఢ్యుఁడు, వజ్రదంష్ట్రుఁడన్
దానవుఁ డొక్కరుం డెదుర।దారసిలెన్ ప్రళయాంతకుండునాన్.

ఉ. "ఇంతభయంకరుండు మును । పెన్నఁడు భూస్థలిఁ బుట్టియుండఁ డ
త్యంతబలాఢ్యుఁ డీతఁడు క।రాంతకుఁడో? యమరాంతకుండొ? క
ల్పాంతకుఁడో చరాచరకు।లాంతకుఁడో" యని, భీతచిత్తులై
చింతిలుచున్నవానరుల । చెంతకు వచ్చుచునుండె దైత్యుఁడున్.

మ. "భళిరా! యెవ్వఁడవీవు? రాకసుఁడవో? । బాహాబలప్రౌఢిన
ల్పులఁగారించిన మెచ్చు లిత్తురొకో? చా।లుంజాలు, దుర్వారదో
ర్బలమున్ జూపఁగవచ్చివాఁడవు గదా, । రారమ్ము; కేరించి నా
యల వేపాటియొ నీకుఁ జూపెదను బా।హాబాహియుద్ధంబునన్.

గీ. అని యహంకారవశమున । నంగదుండు
ఎదురుగావచ్చురాకసు।నీసడించి
తలపడినయంత రోషించి । దానవుండుఁ
బైగొనియె; నిర్వురకుఁ బోరు । పరిఢవిల్లె. 394

గీ. ఘూల్లుమని వీరవానరుల్ । తల్లడిల్ల
నెల్లవేల్పుల యుల్లంబు । లల్లసిల్ల
మెచ్చుకొని వాయుపుత్త్రుండు । హెచ్చరింప
మల్లయుద్ధంబు కడుఁ గడు । మల్లడించె. 395

గీ. స్వాంతమున రామచంద్రుని । సంస్మరించి
మహనిగలతండ్రిప్రఖ్యాతి । మదిఁదలంచి
అంగముం బెంచి, రాక్షసు । నంగదుండు
నేలకుంగూల్చి, యవలీలఁ । గేలఁజెచ్చె. 396

గీ. జాంబవంతుండు చూచి ప్రసన్నుఁడయ్యె
మేలని సమీరపుత్త్రుండు । మెచ్చుకొనియె
వానరులు కెవ్వుమని యార్చి । ప్రస్తుతించి
చప్పళించిరి జయ రామ । చంద్ర యనుచు. 397

గీ. పిదప నచ్చోటు వాసి యు । ద్వేగమునను
వానరులు ఘోరదుర్గమ । పథములందుఁ
దిరిగి చూచుచు నలసటఁ । దీర్చుకొనుచు
నాడలు తమకుఁ గా దనునట్లు । వెడలుచుండ్రి. 398

ఉ. సాహసికాగ్రగణ్యులయి । సాంద్రవనంబుల సంచరించి, యు
త్సాహమునన్ నగాగ్రములఁ । దాండవమాడి గుహాళిఁజొచ్చి, "హా
శ్రీహరి" యంచు సీతకయి । చింతిలి తాపముచే మహాపిపా
సాహతులై భ్రమించిరి జ । లాశయమున్ బరికింప నెల్లడన్. 399

గీ. జనకజాన్వేషణము మాని । జలముకొఱకు
వెదకఁజొచ్చిరి గిరులను । విపినములను
తుదకుఁ బుడిసెడు నీరైన । దొరకకునికి
సొమ్మసిల్లిరి వానర । శూరవరులు. 400

గీ. అంత హనుమంతుఁ డమితధీ । మంతుఁడగుట
నవనిధర మెక్కి పరికించె । నఖిలదిశల
నొండుగుహనుండి జలవిహ । గోత్కరంబు
వెలువడుటఁజూచి యచటికి । వెడలె నపుడు. 401

గీ. జలము లేకున్న వానర । సంచయంబు
యమునిపురమున కరిగెద । రని తలంచి
వెదలి యొకకొండఁజూచి త । ద్బిలముఁజూచి
బిలబహిర్గతజలపక్షి । కులముఁజూచి. 402

చ. బిడికిలి మీర రాముని క । రంబున సలిలంబు లభించునంచు, నం
పదఁగను పేదభంగి హను । మంతుఁడు లోనికిఁ జొచ్చి, యంతటన్
వెదకి, సరోవరంబుఁగని । వెంటనె మార్గము సంతరించి, యా
పద గడచెంగదా యనుచు । వానరులన్ గొనివచ్చెఁ జెచ్చెరన్.

చ. తొరపడి వానరుల్ హనుమ । తోడను శైలబిలంబుఁ జొచ్చి త
త్సరసిని స్నానమాడి తమ । దాహముతీఱఁగ నీరమాని, సుం
దరతరుబృందపుష్పఫల । తండములంగొని సేవచేసి, త
త్పరిసరవృక్షవాటికలఁ । దాఁటుచుఁ గేరుచు నాటలాడుచున్. 404

ఉ. ఎల్లెడ సంచరించి, వర । వృక్షఫలంబులఁ గొల్లలాడి, సం
ఫుల్లసుమంబులన్ జిదిమి । పోరులువెట్టుచుఁ గేళ్లుదాటుచున్
ఉల్లము లుల్లసిల్ల జను । చో కొకచోట దవ్వునఁజూచి రవ్వడే
అల్లనఁ గన్నువిచ్చిన స్వ । యంప్రభనాఁ దనరారు యోగినిన్. 405

గీ. అంతటన్ జాంబవంతుండు । హనుమతోడ
మునుకొని నమస్కరించి, రా । మునియుదంత
మంతయున్ జెప్పి పతిఁగూర్చి । యడిగినంత
నావె చిఱునవ్వునవ్వి యి । ట్లనియె నెలమి. 406

ఉ. వానరులార! రామునిప్ర । భావ మెఱింగిన ధన్యులార! నా
జ్ఞానము యోగమున్ తపము । సర్వము సార్థకమై విరించనుం
డానతియిచ్చినట్టుల శు । భావహమయ్యె, ఫలించె నేఁడు నా
ధ్యానము, రాముఁ డున్నయెడ । కాఁగక యేగెద నీక్షణంబునన్.

గీ. ఏను గంధర్వ తనుజుఁడ; । హేమయనెడు
నప్సరస నాదుసఖి; యాపె । నమరనాథుఁ
డపహరించె, విరక్తి నే । న్యడవియందుఁ
బెద్దకాలంబునుండి తపించుచుంటి. 408

గీ. నాతపంబును గాంచి య । న్నలువ మెచ్చి
వరములన్ గోరుకొమ్మని । కరుణఁ బలికె
నంత దైవంబుఁ జూపెడు । మంటి నేను
ఇంచుక హసించి చతురాస్యుఁ । డిట్టులనియె. 409

గీ. "రాముఁడను నర్కవంశాబ్ధి । సోముఁ డనఁగ
నాపరంధాముఁ డవనిపై । నవతరించు
నాయదంతంబు వానరు । లరుగుదెంచి
నీ కెఱింగింతు రందాక । నిలువుమిచట. 410

గీ. అనిన మేలని కొండంత । యాశతోడ
వేచికొనియుంటి వానర । వీరులార!
ఇపుడ శ్రీరాము దర్శింప । నేగుదాన
నింక మీకార్య మీడేఱు । శంకవలదు. 411

గీ. మీర లెల్లరు వారిధి । తీరమునకుఁ
జెలఁగి శీఘ్రంబ పొం డాల । సింపఁదగదు
శీఘ్రకాలంబులోన ని । ర్విఘ్నముగను
శూరవరులార! జానకిఁ । జూడఁ గలరు." 412

చ. అన విని సంతసించి యపు । డందఱు నంబుధిఁ జేరఁబోయి ర
వ్వనితయు రామచంద్రపద । పద్మములన్ మది సంస్మరించుచున్
జని రఘురామభద్రుఁ గని । చాఁగిలి, మ్రొక్కి, నుతించినంత న
య్యనఘుఁడు సంతసించి యపు । డాదట నిట్లనె నాదరించుచున్.

గీ. "బదరికాశ్రమ మెంతయుఁ । బావనంబు
తల్లి ! ధన్యాత్మురాలి ! నీ।యుల్లమలర
నచట నివసించి యాధ్యాత్మ్య । మభ్యసించి
అతులమోక్షంబుఁ బడసెద । వరుగుమమ్మ." 414

గీ. అనిన ధన్యాత్మురాల నం । చభినుతించి
రామ ! రఘురామ ! తారక।నామయనుచు
నాస్వయంప్రభ యటనుండి । యాక్షణంబ
సంతసించుచు బదరికా।శ్రమముఁ జేరె. 415

చ. "గడువును దాటకుండఁ బ్రభు।కార్యమొనర్పగ నాల్గుదిక్కులం
దడవులఁ బర్వతంబుల గు।హాగహనంబులఁ జొచ్చి యక్కటా
బడలితి మెందు సీత గను।కట్టకయున్నది, మాటదక్కదేన్
జడనిధిలోన వానరులు । చావవలెన్ పలుపల్కులేటికిన్. 416

గీ. ఇపుడు గడువుసమీపించె । మృత్యువట్లు
వ్యర్థము గనేగిన వధించు । నర్కసుతుఁడు,
ఏడ నున్నదో ? జానకి।జాడ తెలియ
దక్కటా ! యంగదా ! యింక । దిక్కులేదె ?" 417

గీ. అనుచు వానరు లేడ్వంగ । నంగదుండు
కంటఁదడిబెట్టి యిట్లనెఁ । "గరుణఁదక్క
జనకుఁ జంపించినట్టి యా।యినసుతుండు
ఈనెపంబున నను వధి।యింపకున్నె ?" 418

గీ. అనుచుఁ బరిపరివిధముల । నంగదాది
వానరోత్తము లెల్లరుఁ । బరితపింప
వినియు విననట్లు వాయునం।దనుఁడు మిన్న
కుండ, నపు డిట్లు జాంబవం।తుండు పల్కె. 419

ఉ. "వానరులార! పౌరుషము । బాయక దైవము విశ్వసించినన్
హానిఘటిల్ల దింత కని । లాత్మజుఁ డుండఁగ హానియుండునే?
మానవుఁడైన రాముఁడు ర । మాధవుఁ డంచుఁ దలంపలేక మీ
మానసముల్ చలించె నను । మానవశంబున భీతిఁ బొందునన్. 420

గీ. సగుణ నిర్గుణ బ్రహ్మమై । సంభవించె
రామచంద్రుండు కార్య । భారము వహించెఁ
గార్యపర్యవసానసం । కల్ప ముడిగి
సంచరింపుఁడు మీకు వి । చారమేల? 421

గీ. గోవులను భూమిదేవుల । దేవతలను
ఉద్ధరింపంగ శ్రీరాముఁ । డుద్భవించెఁ
దలఁప మనము నిమిత్త మా । త్రులము వినుఁడు
ఆపరాత్పరు కార్యంబు । వ్యర్థమగునె? 422

గీ. దిగులు విడనాడి యించుక । ధృతివహించి
కార్యములఁ జేయుఁ డాతని । కరుణవలనఁ
గార్య మీడేఱు ననుకూల । కాలమునకు
వమ్మగునె రామచంద్రుని । పాదసేవ?" 423

క. అని జాంబవంతుఁ డెంతయు
ననుకూలగతిన్ వచింప । నవ్వాక్యములన్
విని, యంగదకాకం గడుఁ
గనకనలాడుచు నొక విహ । గం బరుదెంచెన్. 424

ఉ. ఆఁకటఁ దూలుచున్ స్వగరు । దంచలవాత విధూతభూరుహా
నీకవిభీతవానరుల । నెవ్వడి మ్రింగఁదలంచి "యౌర నా
ళీకభవుండు నేఁటికి బలిష్ఠులఁ గొందఱ భోజనార్థమై
నా కొసఁగెఁగదా యని మ । నంబునఁ బొంగుచు నేఁగుదెంచినన్."

ఉ. "ఏకరణిన్ రఘూత్తముని । యింతిఁ గనుంగొనవచ్చునంచుఁ బెన్
శోకమునన్ దడంబడుచు । శోషిలుచుండిన వానరోత్కరం
బాఁకట మ్రింగవచ్చిన ఖ।గాధిపునిం గని గోరుచుట్టువై
రోఁకటిపో టటంచు మది। రోసి, భయంబునఁ బాఱుచుండఁగన్. 426

గీ. అంత నంగద నెడఁబాప । నంగదుండు
వానరులఁ జూచి యిట్లనె । భయముఁ దక్కి
"ఒక్క విహగంబునకు నిట్టు । లోహటించి
వెడలవచ్చునె వానర । వీరవరులు. 427

చ. ఇతఁడు మహానుభావుఁడు ఖ।గేంద్రుఁడు రాక్షసకోటికిన్ యముం
డతులబలాఢ్యుఁ డార్యవరుఁ । డచ్యుతకీర్తికి రామమూర్తికిన్
హితుఁడు జటాయుసోదరుఁ డ।హీనచరిత్రుఁడు; సాధ్వసంబునన్
మతిని గ్రహింపలేక యను।మానవశంబునఁ బాఱవచ్చునే? 428

చ. ఘనుఁడు జటాయు వల్పుఁడె? జ।గన్నుతమోక్షపదంబుఁ బొందె నా
తని యనుజుండు మూర్ఖనివి।ధంబున శ్రీరఘురామకార్యసా
ధనమున గాఁక పెట్టునె ము।దంబునఁ దోడ్పడుఁగాక యూరకే
మనమున సంశయింతురె? ప్ర।మాదము లేదని విశ్వసింపుఁడీ."

గీ. అనిన విని జాంబవంతుండు । ననిలసుతుఁడు
భయము వలదింక రండని । పలికినంత
నప్పలుకు లెల్ల ఖగవిభుఁ । డాలకించి
"అభయ" మని పల్కి యిట్లనె । నాక్షణంబ. 430

ఉ. "భీతిల నేల? వానరులు । వీరవరేణ్యు లనంగ వింటి నం
పాతిని నేను రాఘవప్ర।భక్తుఁడ మీ కనుకర్తుఁడన్ మహా
త్పాతము సంభవించునని । పాఱుదురే యొకపక్షిఁ జూచి; దై
త్యేశ్వరుఁ [illegible]; [illegible] పుఁ దోఁకించుక మీ యదంతమున్

ఉ. హా మతిహీనుఁడన్ ఖలుఁడ । నాఁకటికాకకుఁ దాళలేక యే
మేమొ వచించి, యన్యులని । యెంచి వధింపఁగ వచ్చినాఁడ, శ్రీ
రామునిభక్తులైన కపి । రాజుల మిత్రులకున్ గొకటా, యక్కటా
రామమునన్ జూఁడన్ దయవు । చాలకృశించిన వేసశించినన్.432

గీ. రండు వానరులార ! శ్రీ । రామకార్య
భారవహులార ! లోకైక । వీరులార !
స్వామియగు రామచంద్రుసే । వకుఁడ నేను
అతనిచరితంబు వర్ణింపఁ । డాలకింతు. 433

చ. అనవిని జాంబవత్ప్రముఖు । లాతనితోడ నుదంతమంతయున్
వినిచినయంత సోదరుని । విక్రమమున్ వినుతించి, యేక్కి "గ్రి
క్కున నను వార్ధితీరమున । కున్ గొనిపొండు, మఃపియసోదరుం
డనఘుఁడు, పావనుండగున । నాతని కిత్తుఁ దిలోదకంబులన్."434

గీ. అనిన మేలని వానరు । లతనిఁ బట్టి
అబ్ధిపొంతకుఁ గొనిపోయి । రాతఁడంబ
స్నానముం జేసి సోదరు । సంస్మరించి
బాష్పములతోడ నెలమి దర్పణము విడిచె. 435

గీ. వానరులఁజూచి శ్రీరాముఁ । బ్రస్తుతించి
జనకజఁదలంచి దనుజనాథుని శపించి
అనుజుని స్మరించి యతనిసా । హసము మెచ్చి
తనదుచరితంబుఁ బలికెఁ బతంగవిభుఁడు. 436

ఉ. "కారణజన్ములార! త్రిజ । గన్నుత భీమబలాఢ్యులార! హం
వీరవరేణ్యులార! రిపు । భీకరులార! మహానుభావులా
రా! రణధీరులార! రఘు । రాముని సేవకులార! మానమా
చారము మీరు శోకించుక యెనన్ వినిపించెద నాలకింపుఁడీ 437

గీ. మా యుదంత మద్భుతము, జటాయు వేను
నన్నదమ్ముల మిరువుర । మవనిఁబుట్టి
పెరిగితిమి శూరవరు లతు।ల బిరుదుతోడఁ
దైత్యు లెల్లరు మముఁగాంచి । తల్లడిల్ల. 438

గీ. బాల్యమున మే మెఱుంగక । పంతమునను
చెలఁగితిమి సూర్యుఁ గబళింప । వలయు ననుచు;
ఇనుని వేఁడిమి కడలి స।హింపలేక
మా జటాయువు వడివడి । మగిడివచ్చె. 439

ఉ. అంతట సాహసించి యసు।వంతయు జంకక మీఁది కేగి నే
నెంతయు సూర్యవేఁడిమి స।హించితి; ఱెక్కలు కాలిపోవ, నా
పంతము సన్నగిల్లఁగ గు।బాలునఁ గూలితి; గొండయందు వి
భ్రాంతిని నన్నుఁగాంచి ముని।వర్యులు తల్లడమంది రత్తఱిన్. 440

గీ. అంతఁ గరుణించి చంద్రముం । డనెడు మౌని
పొంత కేతెంచి యుపచార।ముల నొనర్చి
బాధ వారించి తత్వంబు । బోధచేసి
భయము వలదని ననుఁగాంచి । పలికె నిట్లు. 441

గీ. "ఖగకులోత్తంస! త్రేతాయు।గంబునందు
అవని బ్రహ్మంబు రాముఁడై । యవతరించు
అతని భార్యను రావణుం । డపహరించు
నామె వెదకంగ వానరు । లరుగుదెంత్రు. 442

గీ. వానరులఁజూచి యీవు పా । వనుఁడవౌను
పవనసుతఁగూర్చి యెఱిఁగింతు । వపుడు నీకు
నద్భుతంబుగఁ బక్షంబు । లుద్భవించు
స్వాంతమున రాముని భజింపు । మంతదనుక." 443

గీ. అతనివాక్యంబు లాలించి । నంత నంత
రాత్మ రేకెత్తె నాదు నా । శాంకురంబు
రాముని జపించుకొనుచు మీ । రాకకొఱకు
గాచుకొనియుంటి భక్తాగ్రి । గణ్యులార! 444

గీ. వినుఁడు నాపుత్త్రుఁడు సుకర్ణుఁ । డనెడువాఁడు
ఒక్కనాడు నే నాకట । సొక్కియుండ
సరభసంబున నాదు భో । జనముకొఱకు
వనమృగంబులఁ గొని విలం । బముగ వచ్చె. 445

ఆ. వె. వాఁడు వచ్చునరికి । భాస్కరు డపరాబ్ధి
గ్రుంకుచుండె, నేను । కోపగించి
దయఁదొఱఁగి శపింపఁ । దలఁచినంతనె వాఁడు
భయము గదుర వణకి । పలికె నిట్లు 446

గీ. "జనక! నాపలుకు లనృతంబు । లనక వినుము
నీదు నాఁకటిఁ దలఁదాల్చి । నేను వేగ
వనమృగంబులఁ గైకొని । వచ్చుచుండఁ
ద్రోవఁ గన్పట్టెఁ బుష్పక । ముం డొకండు. 447

చ. ఇరువదిచేతులం గలిగి । యేపుగనున్నశరీరయష్టితో
శిరములపంక్తితోఁ బురమ । శేఖరుఁ డొక్కఁడు రాచకీవితోఁ
తరుణి నొకర్తుకన్ మరుని । తల్లినిఁబోలు త్రిలోకసుందరిన్
అరదమునందుఁ బెట్టుకొని । యంబరవీథిని వచ్చుచుండఁగన్. 448

గీ. తొలుత మృగమంచు నెమ్మదిఁ । దలఁచి వాని
నొడిసిపట్టితి నంత వాఁ । డొదిగి బెదరి
ఒకపుఁదప్పించుకొని నన్ను । విడువు మనుచుఁ
గలుపుఁగోలుతనంబును । దెలుపుకొనుచు. 449

గీ. తేరు నడపుచు దక్షిణదిశను బట్టి
చూచుచుండంగ వెడలె నా శూరవరుఁడు
అందుచే నింతయాలస్య మయ్యె" ననుచు
వేడుకొనఁ జొచ్చె వానరవీరులార! 450

ఉ. "అంతటివాఁడు వేడుకొనె" నంచు దలఁచి సుతుండు వాని నా
పొంతకుఁ దేక పోవిడిచెఁ; బొక్కితి, నక్కట తెక్కు లూడెనం
చెంతయు నేడ్చితిన్ సుతు సహింపక తిట్టితి నేమిసేతు, నొ
క్కింతబలంబు లేక యసురేంద్రుని నాగతిఁ బోవనిచ్చితిన్. 451

గీ. అకట! దౌర్భాగ్యుఁడను గాక యవనిపుత్రిఁ
బ్రోవలేకుంటి నని మదిన్ బొక్కి పొక్కి
మునివరేణ్యునివాక్యంబులను దలంచి,
మీకొఱకుఁ గాచుకొనియుంటి మిత్రులార! 452

చ. వినుఁడు పయోధిమధ్యమున వేల్పులకున్ జొఱరానిదై, సహ
స్రనయనువ్రిక్కబల్లెమయి శాత్రవకోటి కకాలమృత్యువై
కనులకుఁ బండువై, సొబఁగుఁ గల్గి, త్రికూటధరాధరంబుపై
దనరుచునుండు లంక, బలదర్పితదానవ సాహసాంకయై. 453

చ. సకలవిలాసముల్ గలిగి సన్నుతికెక్కి, ధరిత్రిదేవికిన్
ముకురముఁబోలులంక, తలపోయఁగ ముజ్జగమందు నట్టిదిం
కొకటి రహింపఁజాల దననొప్పగుఁ, జిత్రకళల్ గలట్టి సం
చికయని ఖ్యాతిగన్న వరశిల్పులు దెల్పఁగ నాలకించితిన్. 454

ఉ. మానవులన్ వధించి, వరమానినులన్ గ్రహియించి, దేవతా
స్థానము ముట్టడించి, గలసంపద లెల్ల హరించి, దిట్టలౌ
దానవులెల్లఁ గొల్వ బ్రమదంబునఁ గ్రొవ్వివరావణుండు, లం
కానగరంబునన్ మెలఁగు గాలియు గీలియు సేవసేయఁగన్. 455

గీ. అట్టి యకళంకయగు లంక యందు సతముఁ
జూడసొంపుగనుండు నశోకవనము
పొందు బరికింపుఁ డచ్చోట భూమిపుత్త్రి
నిక్కముగనుండు, మీకు సందియము వలదు. 456

క. మతిమంతుని బలవంతుని
వెతకుఁడు మీ సేన నట్టి వీరుఁడు గలఁడేన్
శతయోజనముల దూరము
నతివేగము దాఁటవలయు నసురులు పొగడన్. 457

చ. ఎవఁడు పయోధిదాఁటి, యసురేంద్రపురంబును జొచ్చి జంకుఁద
క్క వనమునందు సీతఁ బరికించి, యుదంత మెఱింగి రాక్షస
ప్రవరు లెదిర్చి రేన్ తనదు బల్మి నొకించుక చూపి, వచ్చువాఁ
డవనిరహించు రాముకృప కాస్పదుఁడై చిరకాలజీవియై. 458

గీ. రామచంద్రుని నామమంత్రము జపించి
పారముఁ జూడరాని సంసారజలధి
దాఁటి యెట్టిపామరుఁడైన ధన్యుఁ డగును
అరయ నివార్ధి లంఘించు టనఁగ నెంత. 459

గీ. అతులలాఘవంబుగలట్టి యలఘుఁ డెవఁడొ
మీరె నిర్ణయించుకొనుండు మిత్రులార!
ఎవ్వఁ డీవార్ధిలంఘించి యేగుదెంచు
వాని కర్పింపు డీ నాదువందనంబు. 460

గీ. కనుఁడు శ్రీరామచంద్రుని కరుణవలనఁ
బక్షములు వచ్చె వానరప్రవరులార!
రామకార్యంబు సాధించి రండు వేగ"
మనుచు సంపాతి మీఁదికి నెగిరిచనియె. 461

మ. శరవేగంబున నూత్నపక్షములతో సంపాతి యేగంగ, "మా
యురె" యంచున్ గల వానరప్రముఖు లన్యోన్యావలోకంబులన్
దరహాసంబులఁ జేయుచున్ నిలిచి సంద్రంబున్ విలోకించుచున్
పరిశీలింపఁగఁ జొచ్చి రాత్మబలముల్ ప్రాగల్భ్య మేపారఁగన్ 462

చ. "అలఁతిగ నూఱుయోజనము లంబుధి దాఁటుట యెట్టులెట్టులే
జలనిధి దాఁటిరా గడువు చాలదు, కార్యము వ్యర్థమౌనయం
చలసులమంచు వాలిసుతుఁ డంతట మాన్పడి నిల్చె జాంబవ
ద్బలిముఖవానరప్రముఖ బాహుబలంబుల లోఁ దలంచుచున్.

గీ. "గడుసరివి పెద్దకాలంబుఁ గడపినావు
గడువు చాలదు, నీవెఱుంగనివి తాన
మిన్నకుందువె మాకెల్ల మేటివయ్యు
సకలజననుత ధీమంత! జాంబవంత!" 464

గీ. అనిన నంగదుపలుకుల నాలకించి
సకలవానరలం జూచి జాంబవంతుఁ
"డలఘుబలులార! వార్ధక్య మలము కొనియె
నేమి సేయుదు మనకార్య మెట్టులగును? 465

ఉ. పూర్వము ఖ్యాతిఁ గాంచితి నపూర్వబలాఢ్యుఁ డితం డనంగ, నా
గర్వము నాకుఁ జెల్లెఁ గల కాలము నిల్చునె యౌవనంబు? నే
నుర్విని యౌవనంబున మహోత్సుకతన్ జరియించునాఁడు న
న్నోర్వఁగఁజాలు బల్లిదుని నొక్కని నేన్ గననైతి నెయ్యెడన్.

గీ. వినుఁడు నాయౌవనోదయవేళఁ గాదె
విష్ణువు, త్రివిక్రముండయి వెలసె భువిని
బలి నణంచినవామను పాదములను
గాంచి వలగొని వచ్చితి గడియలోన. 467

గీ. ఇట్టి వార్ధక్యదశ నైన । నీడఁబోక
వార్ధి నేనొక లంఘించి । వచ్చియుండుఁ
గాని బదరికాశ్రమవాస । కారణమునఁ
గాలువడి దప్పె ముదుమును । గోలుపోతి. 468

గీ. బదరికాశ్రమవాసినై । వనమునందు
ఫలములన్ దిని యొకనాఁడు । పండుకొంటి
నంత రాక్షసవరుఁ డొక్కఁ । డరుగుదెంచి
యొక్క మునివర్యుని వధింప । నొడిసిపట్టె. 469

గీ. బ్రాహ్మణుఁడు నిత్యముఁ దపించు । భక్తవరుఁడు
అట్టివానిని భక్షింపఁ । బట్టినట్టి
అసురవరు నెట్టి శిక్షింపఁ । నరిగినాడ
నిరువురకుఁ బెద్దపోరయ్యె । ధరణి వణఁకె. 470

గీ. అసురవరుఁ డప్పు డంతయు । నాగ్రహించి
మూఁడుయోజనముల్ గల । భూమిధరముఁ
బట్టుకొని వచ్చి యేపుమైఁ । గొట్టె నన్నుఁ
గాలనెట్టితి ముదుమును । గోలుపోతి. 471

గీ. వెంటనే వానిమెడఁబట్టి । విఱుగఁగొట్టి
నేలకుం గూల్చి చీల్చితి । నిఖలమునులు
నన్నుఁ దీవించి మే లని । సన్నుతింప;
అప్రతాపంబు నాకిప్పు । డబ్బునొక్కొ ? 472

గీ. ఒక్కయోఁజనఁ దొంబది । యోజనంబు
లిప్పుడైనను దాఁటెద । నేమిలాభ
మందుచే నేమిలోచక । యరయుచుంటి
దండిమగఁ డెవ్వఁ డీవార్ధి । దాఁటుననుచు." 473

గీ. అనిన విని వానరోత్తము । లదరిబెదరి
అంగదునిఁ జూచి రఘుకులా । ద్యుంబు కొలుకు
వాయునందనుఁ డేమియుఁ । బాలుపోక
నేత్రములమోడ్చి రాము ధ్యా । నించుచుండె. 474

సీ. వికటుండు వానర । వీరులఁ జూచి ము
ప్పదియామడలు దాఁటి । వత్తుననియె
నీలుండు నలుబది । నాలుగామడల నే
దాఁటనోపుదునని । యోటువడియె
దుర్ధరుం డేఁబది । తొమ్మిది యామడ
లవలీల దాఁటెద । నని వచించె
నలుఁడు డెబ్బది యోజ । నంబుల లంఘించు
పీఁడనని పల్కె । విజ్ఞపీఁగె

గీ. దధిముఖుఁడు లేచి యెనుబది । దాఁటవచ్చు
దిరిగి గాఁజాలనేమొ సం । దేహమనియె
నంత మిగిలినవానరు । లలవు లేక
మిన్నకుండిరి మిక్కిలి । ఖిన్నులగుచు. 475

గీ. అంత నంగదుఁ డించుక । యంగలార్చి
పరిపరివిధంబులఁ దలంచి । పరితపించి
అల్లకల్లోలముగ నున్న । యబ్ధి జూచి
ఎల్లవానరులం గాంచి । యిట్టులనియె. 476

గీ. "ఒక్క దుముకున నే నూఱు । యోజనములు
దాఁటెదంగాని యచ్చోట । దైత్యవరుల
తోడఁ బోరాడవలసెనేన్ । దోర్బలంబు
చాలునో చాలదోయని । సందియంతు." 477

గీ. అనిన నానని తలయూచి యంగదుఁడని
"భటులు సేవకులుండఁగ వైరిపురికిఁ
దొలుత యువరాజు వెడలినఁ దోషరు హాని"
అనుచు జాంబవంతుఁడు చూచె నాంజనేయు. 478

గీ. "రాజధర్మానుగతి, యువరాజుఁ దొలుత
వైరుల స్థలాంతరమునకుఁ బాపఁదగదు;
అచటికిం బోయి యేతెంచు నలఘుఁ డెవఁడు?
హనుమ ! యోచింపుమా వేగ వ్యవధి లేదు. 479

చ. నెఱసరి నీయవస్థ గమనింపకయుంటివో ? రాముకార్యమున్
మఱచితివేమొ ? లేక తగ మార్గమెఱింగి, యెఱుంగనట్లు మా
అఱిమఱిఁ జూచుచుంటివో ? మహాబలనందన! నీబలంబు నీ
వెఱుఁగవుగాక యీజలధి యంతటిదైనను నీకు లెక్కయే.? 480

గీ. వాయుసుతుఁడవు, వాయువువంటిబల్లి
దుఁడవు, బ్రహ్మచారివి, పావనుఁడవు, ఘనుఁడ
వీవు లంఘింపఁ దొడరిన నీపయోధి
కాల్వ యగుఁగాదె నీదువేగమున ననఘ. ! 481

ఉ. తెంపరి వెందు వాయువుగతిన్ జొఱఁబాఱఁగఁజాలు, దీవు సా
ధింపఁగ లేనికార్యము మహిన్ దలపోయఁగ లోకమందుఁ గా
న్పింపదు, మాయవస్థ గమనింపుము, నింపుము కూర్మి, మమ్ము ర
క్షింపు ముపాయమొందు పరికింపుము వేల్పులు సన్నతింపఁగన్.

చ. వెరవరి వే నెఱుఁగుదును వేళనుబట్టి మెలంగునట్టి ధీ
వరుఁడవు, లంకయందుఁగల వైరులనెల్లర నొక్కతోకతో
గిరగిర ద్రిప్పికొట్టఁగల కేసరి వాకదఁ బాపకుండ నీ
కరణిని మానమూనితివి కారణమేమి సమీరనందనా. 483

చ. వినుఁడు సమీరనందను పవిత్రచరిత్రము వీనులార! హె
చ్చినతమి సావధానముగఁ । జెప్పెద నించుక యాలకింపుఁడీ
ఘనుఁడ నసాధ్యకార్యము జగంబున లేదని చాటవచ్చు, నీ
తనిజననంబు సర్వజనసన్నుతమందురు సన్మునీశ్వరుల్. 484

క. హిమవత్పర్వతము సమీ
పమునన్ కశ్యపుఁడను ఋషి । వర్యుఁ డొకం డు
త్తముఁడు తపస్సంపన్నుఁడు
మమకారముఁ దక్కి యాశ్రమంబున నుండున్ 485

గీ. అమ్మహాత్ముని నిరతంబు । నాశ్రయించి
అచట మఱికొందఱు మునీంద్రు । లలరుచుండ్రు
అంత నొకనాఁడు వనగజం । బామహిమీఱి
అల్లకల్లోలముం జేసె । నాశ్రమంబు. 486

గీ. అచట హనుమంతుతండ్రి, య । త్యధికబలుఁడు
సాటిలేనట్టిమగలఁడు । మేటిమగఁడు
తపముఁ గావించుకొనుచు సం । తతము నుండుఁ
గేసరియనంగ నుతికెక్కె । క్షితి నతండు. 487

క. కేసరియనునామ మతని
కే సరి విక్రమజితశత । కేసరి వనరా
ట్కేసరి సురనుత వానర
కేసరి రక్షఃకులనర । కేసరి సరిగా. 488

గీ. "అకట! యైరావతముఁబోలి । నట్టిగజము
వచ్చి విచ్చలవిడిహెచ్చి । పెచ్చుపెఱిగె
మమ్ము రక్షింపుమా" యంచు । మౌనివరులు
వేఁడుకొనఁ జొచ్చి రాతని । వివిధగతుల. 489

ఉ. "చాలు నుతింపనేల ముని।సత్తములార! యొకింత నెమ్మదిన్
దాలిమిఁ బూనుఁ" డంచు భుజ।దర్పమునన్ జెలరేగి మత్తశుం
డాలము ముష్టితాడనము।నన్ భువిఁగూలిచి కొట్టి కుంభమున్
గేలను జీల్చి చంపెఁ ద।న కేసరినామము సార్థకంబుగాన్. 490

గీ. అంత మునివర్యు లెల్లరు । నతనికడకు
వరము లిచ్చెదమని మెచ్చి । వచ్చినంత
కేసరి మునీంద్రులన్ జూచి । కేలుమోడ్చి
ఎద నొకించుక యోచించి । యిట్టులనియె. 491

గీ. మీరు భగవత్సమానులు । మెచ్చి నాకు
వరము లిత్తురే లోకపా।వనుఁడనైతి
అనిలునకుఁ దుల్యుఁడైనట్టి । యతులబలుఁడు
నాకుమారుఁడై జన్మించి । నన్ రహింతు. 492

చ. అనవిని మౌనులెల్లరుఁ ద।థాస్తని యచ్చొటువాసి రావయిన్
వినుఁ డొకనాఁడు కేసరిప।విత్రకులాంగన సచ్చరిత్ర యం
జనయనుకంజనేత్ర కడుఁ।జక్కనిచుక్క యనంగ లోకమం
దున నుతిఁగొన్నచాన పుర।దోట మెలంగుచునుండె నొంటిమై.

క. బంగారము ఘనమించిన
సింగారము గ్రాలమోము । శీతాంశుగతిన్
రంగారఁ జూచి యంగజు
కంగారును గోరివచ్చె । గంధవహుండున్. 494

గీ. ప్రకృతి సంపదఁ జూచుచుఁ । బాకజాక్షి
నిండుమనమున నొకశిలన్ । బండుకొనియె
గడలఁ గమ్మఁపూదావి । గడలుకొనఁగ
నాపె వీక్షించి మోహించె । ననిలుఁ డెలమి. 495

చ. అనిలుఁడు చేరవచ్చి కుసుమాంగిసొబంగును గాంచి కాముఁడై
తను వవశంబుగాఁ దరుణి దార్కొని మెల్లఁగఁ గౌఁగిలించె న
వ్వనరుహనేత్రి తుళ్లిపడి వాయువుఁ గాంచి శపింపనెంచినం
తనె గమనించి పుష్పములతావి గుబుల్కొన నాతఁ డిట్లనున్.

గీ. "వెలఁది! కోపించి నన్ను శపింపఁదగదు
జరిగినయుదంత మెఱుఁగవు సన్నుతాంగి!
నీమగఁడు నన్నుఁబోలిన నిరుపమాన
బలుఁడు సుతుఁడు కాఁగోరె నా బ్రాహ్మణులను. 497

గీ. అట్లయగుఁగాక యనిరి బ్రాహ్మణవరేణ్యు
లక్కలింబున దాఁకితి ననువమాంగి
గర్భము ఫలించుఁ బుత్త్రుఁ డావిర్భవించు
వాయునందనుఁడన వాఁడు ప్రఖ్యాతిఁ గాంచు. 498

గీ. మునులవాక్కు లమోఘముల్ పూవుఁబోణి
అట్ల నాదు వీర్య మమోఘ మంబుజాక్షి!
అజుని సంకల్పము బలీయ మనువమాంగి!
అనుచు నాశీర్వదించి యయ్యనిలుఁ డేగె. 499

క. అంజన నయనవినిర్జిత
ఖంజన సతతమునిజనకాంక్షితవిజ్ఞా
నాంజన పతివజ్జకు వీఁ
కం జన నతఁ డావెనరణిఁ గని యిట్లనియెన్. 500

ఉ. "తొండలపాటుతో నయనతోయరుహద్వయ మెఱ్ఱవాఱఁగా
దండము తల్లడిల్లఁగ పదిన్ పదకంకణముల్ తడంబడన్
కుందన బొమ్మవారి కనుఁగొల్కులజాఱఁగ నేగుదెంచితో
యందగజేంద్రగామిని ప్రమాదము లేదుగదా వచింపుమా." 501

గీ. అనిన విని చేలఁ గన్నుల । నద్దుకొనుచు
జరిగినయుదంతమంతయు । జలరుహాక్షి
మగనితోఁ జెప్పె నాతఁడు । మగువఁ జూచి
"కుందకుము కోర్కె యీడేఱుఁ । గుందరదన." 502

గీ. అనుచు నోదార్చి మేలని । యనుమతించి
కౌఁగిటం జేర్చి ముద్దాడి । కనులఁ దుడిచి
నంత సుస్వాంతమునఁ గాంత । యంతఁ దక్క
సంశయముఁ బాసి యెంతయు । సంతసించె. 503

గీ. అంత నొకనాఁడు శుభలగ్న । మందు నాపె
* గర్భమున నర్భకుఁ డొకఁ డా । విర్భవించి
దినదినంబును వర్ధిల్లెఁ । దేజమునను
శుక్లపక్షశశాంకుని । శోభమీఱి. 504

గీ. ఆతఁడే యీతఁ డీరీతి । ఖ్యాతిఁ గాంచె
బాల్యమున నీతఁ డొకనాఁడు । బాలభాను
మండలముఁ జూచి ఫల మని । మతిభ్రమించి
మ్రింగ నొక్కుమ్మడిఁ జెలంగి । నింగి కెగరె. 505

గీ. అంత నమరేంద్రుఁ డలిగి వ । జ్రాయుధమునఁ
కెలఁకిఁ గొట్టిన యంత మూ । ర్ఛిల్లె నితఁడు
వాయుదేవుండు కోపించి । వాయువులను
అవని బంధించె నాకు ల । ల్లాడకుండ. 506

గీ. ఉర్వి శవసాదృశ వస్థ । నొందనంగ
వ్యాకులముఁ బొందె నెల్లెడ । నఖిలజీవు

* స్వాతినక్షత్రము, మేషలగ్నముఁ గల కార్తీకబహుళ చతుర్దశి భౌమవారము:—హనుమంతుని జననము

లంత దేవతఁ జేతెంచి । యనిలుఁ జూచి
చేతులన్ మోడ్చి హనుమ నా । శీర్వదించి. 507

గీ. "న్యాయ్యమా వాయుదేవ మ । హానుభావ!
ఈవు కోపించినన్ సృష్టి । యెట్టులుండు?
అఖిలవరముల నిచ్చెద । మాగ్రహంబు
వీడి జీవుల నెల్ల గా । పాడు మింక." 508

గీ. అనినవిని దుఃఖమించుక । యడగనయించి
తనదుసుతుఁ జూచి యా దేవ । తలను జూచి
తల్లడిల్లెడుజీవసం । తతులఁ జూచి
ఎంతయున్ సంతసించుచు । నిట్టు లనియె. 509

క. "అమరత్వ మజేయత్వము
సమతత్వము సర్వశాస్త్ర । సంపూర్ణత్వం
బమరఁగ గరుణింపుఁడు నా
కొమరుని దీవింపుఁ డపుడు । గొల్చెద మిమ్మున్. 510

గీ. సంతతము సత్పథంబున । సంచరించి
సాధుసజ్జనసాంగత్య । సరణిఁ గాంచి
నిఖిల శస్త్రాస్త్రములను తృ । ణీకరించి
నాకుమారుఁడు శోభిల్లు । గాక భువిని. 511

గీ. ఆదివిష్ణువు రాముఁడై । యవతరించ
నతనిభక్తుఁడై యతులవి । ఖ్యాతిఁ గాంచి
నాకుమారుఁడు శోభిల్లుఁ । గాక భువిని
భవ్యమతులార! సకలది । వ్యులార!." 512

గీ. అట్లయగుఁ గాక యనుచు స । త్యముగ నెల్ల
సంతసించుచు వెడలిరి । స్వర్గమునకుఁ

బిదప నెల్లెడ విచ్చల।విడిగ నీవు
సంచరించితి వీర! కే।సరికుమార!. 513

గీ. నాఁటినుండియు జీవసం।తతి రహింప
భళిర! వాయుదేవుఁడు జగ।త్ప్రాణుఁడయ్యెఁ
బర్వతంబుల వనముల। సర్వదిశల
మించినబలుండవై సంచ।రించి తీవు. 514

గీ. బాల్యమున నీవు నైజచా।పల్యమునను
మునులయాశ్రమంబులఁ గొంటె।తనముఁ జూప
వార లెల్లరు నీవు నీ।బలము మఱచు
నట్టుల శపించి రించుక। యాగ్రహించి. 515

గీ. అమరపతి నీహనువుల।యందుఁ గొట్టి
నంత నీవోర్చి హనుమంతుఁ। డనఁగ భువిని
ఖ్యాతిఁ గాంచితి వీర లో।కైకవీర!
అమితబలవంత! హనుమంత!। అరికృతాంత!." 516

గీ. అంత హనుమంతుఁ డింతయు। నాలకించి
జానకిఁ దలంచి తనయాత్మ।శక్తిఁ గాంచి
రాముని స్మరించి, పవనునిఁ। బ్రస్తుతించి
అసురవిభునెంచి యొంతయు। నాగ్రహించి. 517

గీ. మెఱవడిన్ వాల మాడించి। మేను పెంచి
లంకదెసఁ జూడ్కి నిగిడించి। హుంకరించి
జాంబవంతునకున్ మ్రొక్కి। జరకుఁ దక్కి
ఎల్లవానరు లాలింప। నిట్టులనియె. 518

ఉ. "రావణకుంభకర్ణముఖ।రాక్షసవీరుల యేపడంచి, సీ
తావనితాశిరోమణి య।దంతము సాంతముగా నెఱింగి, సం
భావనఁ బొంది, యిచ్చటికి। వచ్చెదఁ జెచ్చెర రాకయున్న నేఁ
బావనిఁ గాను, రాఘవుని।భక్తుఁడఁ గాను, త్యజింతు దేహమున్.

మ. భళిరా! రాముఁడు నాదుదైవము, జగత్త్రాణుండు నాతండ్రి, వే
ల్పులచే నల్లవరంబులన్ బడసితిన్ లోకుల్ ప్రశంసింపఁగా, నీ
జలధిన్ దాఁటఁగఁజాలనేని వసుధన్ శౌర్యంబె, యెవ్వానికౌ?
నిలుఁడీ వానరయోధులార! ధృతితో నిశ్చింతతో నిచ్చటన్. 520

క. కదలించెద భూగోళము
విదళించెద నాదిశేషు వేయిశిరంబుల్
కుదలించెద లంకేశుని
వదలించెద జనకపుత్త్రిఁ బావనగాత్రిన్. 521

శా. త్రుంతున్ బ్రహ్మశిరంబులన్, ధరణిఁ జేర్తున్, గాల్తు లోకాళి, నం
డింతున్ సప్తమహాబ్ధులన్, సురల నేర్పింతున్, పదిన్ గొండలన్
దాతున్ బిండిగఁ జేయుదున్, దితిజులన్ దండింతు, శ్రీజానకీ
కాంతారత్నముఁ గానకున్నమును లంకన్ బెల్లగింతున్ ధృతిన్. 522

చ. దనుజు లెదిర్చినన్ జెలఁగి స్థాణువు శూలముఁ బూని వచ్చినన్
వనజభవుండు వద్దని సుపర్వులతోఁ జనుదెంచి యడ్డినన్
ఘనముగ రామబాణమనఁ గాఁ జని రావణునిన్ మదించి యే
జనకజఁ జూచి రామనృపశేఖరునిమ్ముదిరిఁ జూపి వచ్చెదన్. 523

శా. ఓరీ రావణ! లోకమాతయగు నా యుర్వీసుతన్ దొంగవై
పేరీతిన్ హరియించినాఁడ వహహా యీవార్ధి లంఘించి లం
కారాజ్యంబును జేరఁజాలరనుచున్ గర్వించి వంచించితే?
వీరుల్ మేలన నన్నుఁ దార్కొనుచు నీటీరంబు నేఁజూచెదన్."

మ. అని లంకాపురిఁ బెల్లగింతునని మీరావేశముం బొందిన హ
నుమ్మద్వీరుఁ డొకమ్మడి హుంకరించి యతులోత్సాహంబు కారవిరాడాకృతిన్
గొనెనన్నట్టుల మేనుపెంచి త్రుటిలోఁ గొండంతయై పొంగినన్
హనుమంతున్ గని జాంబవంతుఁ డన్రు హర్షానందముం బొందుచున్.

ఉ. "నాయక! యాంజనేయ! రఘునాథుని భక్తుఁడ వట్టి కార్యమేఁ
జేయుదువం చెఱింగియె వచించితి, నీమహిమం బమోఘ మీ
తోయధి దాఁటి బంధుజనదుఃఖముఁ బాపఁగ నోపుదీవు రా
మాయణధూర్వహుండ వఖిలాశ్రితచందన! వాయునందనా!. 526

ఉ. దంబుగ మేను పెంచి జగదంబునకున్ దెగినిల్చితేని, యా
డంబరశూన్యుఁడై నిజవిడంబనలన్ విడనాడి నీవు పా
దంబుల వ్రాలి జానకినిఁ దర్పక రావణుఁ దప్పగించు; ని
య్యంబుధి దాఁటి మమ్ము వినదంబుధి మండితరింపఁజేయుమా." 527

గీ. అనినవిని జాంబవంతుని నాదరించి
కేసరిసుతుండు కేసరి కీసడించు
గతిని గర్జించి యిట్లనెఁ "గంధి దాఁటి
ఇచటకున్నట్లు త్రుటిలోన నేఁగుదెంతు. 528

గీ. ఇంక జాగేల? రాముని యెంక కాదు
పాని చేకూరదని నమ్ముఁ డాత్మలందు
దైవబలముకు మించునే దనుజబలము
జనకజం జూచివత్తు నిస్సంశయముగ. 529

చ. జలనిధి దాఁటి సీతఁగని చయ్యన వచ్చెద నాశయింపఁగా
వలదు, రావణు ద్రుంచి బ్రహ్మశిరంబుఁ దన్ని విజ్వాల
జ్వాలనుని మ్రింగి ఘోరసముదగ్రమదంబున నాంచి వత్తు, నా
బలముఁ జలంబు మీరెఱుఁగరే, జాలరు, నాకు నసాధ్య మున్నదే"?

చ. అనవిని జాంబవంతుఁ డనిలాత్మజుఁ గౌఁగిటఁ జేర్చి యిట్లనున్
"జనకజ నెట్టులేన్ గనినఁ జాలును, రాముఁడు వార్ధి దాఁటి, య
ద్దనుజులఁ సంహరించి, తన తన్విని గైకొని తన్విఁ బొందు; బా
వని కడుఁ బావనుండని సువర్ణ్యులు విన్న మతింతురెంతయున్."

చ. అనిశము రామగాథఁ గొనియాడిన నాడినఁ బాటఁ బాడినన్.
వినిన, స్మరించినన్ భువిఁ బవిత్రుఁడు స్వర్గసుఖంబు లొందు నిం
ద్రునివలె; ఘోరసంసరణరోగముఁ బాపు మహౌషధంబు నాఁ
దనరినరామనామసుధఁ ద్రావినవాఁడె శివుండు భూస్థలిన్. 532

---

క. అలఘుఁడు శ్రీరామచరణ
జలరుహమదబంభరుండు; సాత్వికుఁ డగు శ్రీ
తులసీదాసునికవితం
గల భావ మొకింత వ్రాయఁ గలిగితి నమో ?. 533

క. హనుమత్పూజితనామా !
వినమత్సుత్రామ ! వినుతవిబుధస్తోమా !
ఇనకులవననిధిసోమా ! 534
జననుతసుగుణాభిరామ! జయరఘురామా !. 535

చ. సనకసనందనాదిమునిచంద్రనిషేవితసత్కథాసుధా
వనధిజనద్యశఃకుముదబంధుకరామృతధౌతసర్వది
గ్జనపదవర్తినస్థజనసన్నుతజీవన! సర్వలోకపా
వన! సుజనావనా! యఖిలపాపవిమోచన! పద్మలోచనా! 536

మ. వినమితదనుజేంద్రా! విస్ఫురత్కీర్తి సాంద్రా!
త్రినయననుతనామా ! దేవతాసార్వభౌమా !
కునృపతిమదభంగా ! కోమలశ్యామలాంగా !
జనహితమతిమంతా ! జానకీ ప్రాణకాంతా !. 537

గద్య.

ఇది శ్రీ భాగవతుల నారసింహశర్మ విరచిత శ్రీతులసీరామాయణమునందలి కిష్కింధా కాండము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు.